# పీష్వానారాయణరావు.



ఇది

అయిదంకములనాటకము.

మ॥ రా॥ శ్రీ ద్రోణంరాజు శీతారామారావుగారిచే

రచియింపఁబడి

బొండాడ చిననరశింహంగారిచే ప్రచురింపఁబడియె.

రెండవకూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1917





[వెల 10 అణాలు.

# పీఠిక

కవిగ్రామణులారా !

ఈనాటకములోనికథ మన దేశచరిత్రాంశసంబంధమయిన మహారాష్ట్రకథయని చూచిన ప్రతివానికిని చదివిన సమస్తజనులకును విధిగాఁ దోచకమానదు. ఇదియభినవరాఘవాద్యనేకనాటకకర్తలైన మ॥రా॥రా॥ ద్రోణంరాజు సీతారామారావుకవిగారిచే రచియింపఁబడి రాణ్మహేంద్రపుర నివాసులయి వైశ్యకుల క్షీరపారావారరాకాసుధాకరులయిన బొండాడ చిననరశింహాముగారికి రైటుఆఫ్ పబ్లికేషనుకీయఁబడి ప్రచురింపఁబడియె. ఇందున్న తప్పులను క్షమించెదరని గ్రంథకర్త విద్వద్రాజులను మిక్కిలి ప్రార్థించుచున్నారు. గ్రంథకర్తగారి కిద్దానిపీఠికను విస్తరించి వ్రాయవలెనని కుతూహలమున్నదిగాని దేహారోగ్యము చెడినందున నింతటితో ముగింపవలసి వచ్చినది.

ది 9—4—12
రాజమండ్రి.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,
బాచెర్ల వెంకటకృష్ణారావు.

## ఈనాటకమునవచ్చు పాత్రములు.

సూత్రధారుఁడు.

పారిపార్శ్వకుఁడు

సఖారామబాపు—(మంత్రి)

నారాయణరావు—కథానాయకుఁడు.

నానాఫర్నవీసు—(మంత్రి)

సుమేర్సింగు—(సేనాధిపతి)

సేవకుఁడు.

మహమ్మదుయూసఫ్
తుల్యాఘవారు
బుధసింగు
ఖడకసింగు
ఇచ్ఛారామపంతులు
} మహారాష్ట్రవీరులు

రఘునాధరావు—(నారాయణరావు పినతండ్రి)

ఛపాజేతీలేఖరు

విష్ణుశర్మ

రామశాస్త్రిలు

ఒకపురుషుఁడు

—స్త్రీలు—

ఆనందీభాయి—నారాయణరావు పినతల్లి

గంగాభాయి—కథానాయిక

నర్మద

**N. B.** ఇంకను గథాసందర్భమున భటులు మొదలగు వారు
చ్చిన వత్తురు.

శ్రీమత్పరదేవతాయనమః

# శ్రీ ష్యా నా రా య ణ రా వు

---

నాంది

శా. మానీంద్రుల్ ముదమూరగా వనులలో ♦ భక్తిన్ మహానిష్ఠతో
నానాభంగుల ఘోరమైన తపముల్ ♦ గావించి యేమూర్తినిన్
గానంగామదినెంతురట్టి త్రిజగ ♦ త్కళ్యాణ తేజుండునౌ
శ్రీనారాయణుడేలుగాత! శుభదృ ♦ ష్టిన్ సజ్జన శ్రేణినిన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు.)

సూ—(తనలో) ఆహా! ఏమినాభాగ్యము ! సకలశాస్త్రపారంగతులగు నీసభ్యులు నన్నుఁగనుగొని, సూత్రధార! పురాణగాథలచే వినువుఁజెందియున్న మా డెందంబులకు, నేడేదియైన చరిత్రసంబంధమగు, నాటకంబాడి, సంతసంబుఁగొల్పుమనియాజ్ఞనిచ్చిరిగదా? అందున కేనెంతయు సంతసంబందితిగాని; ఏనాటకప్రదర్శనంబున వీరిహృదయముల రంజింపఁజేయుదునాయని సందియంబగుచున్నది. అయినను యిందులనుగూర్చి పారిపార్శ్వకునితో నాలోచించెదనుగాక! (ప్రక్కకుతిరిగి) పారిపార్శ్వకా! ఒకసారి నీవిటురమ్ము.

పారి—(ప్రవేశించి)అయ్యా! ఏమి శెలవు.

సూత్ర—సఖుడా! ఈసభ్యులందరును, చరిత్రసంబంధమగునాటకమునకై, చకోరంబులుచంద్రునిరాకకై వేచుచందంబున వేచియుండిరి. దీనిఁగూర్చి నీతోఁగూడ నాలోచించుదమని పిలచితి.

పారి—నీకంటె నాకెక్కువ దెలియునా! అయినను; యేనాటకప్రదర్శనంబున వీరల రంజింపఁజేయుదము?

సూత్రి—(ఆలోచించి)మహారాష్ట్రచరిత్రమందు, సుప్రసిద్ధమైన పేష్వానారాయణరావు వధ యనుకథ ప్రదర్శనంబునకు యోగ్యమని తలంచెద.

పారి—ఓహెూ! ఈకథ నాకును జ్ఞప్తికివచ్చినది. యిందేకదా, నారాయణరావు, పినతల్లియగు నానందీబాయి దురాలోచనంజేసి మడి యుట సంభవించును!

సూత్రి—అవును.

పారి—అబ్బబ్బా! అతివిషాదకరంబె.

సూత్రి—విషాదకరంబులగు నాటకంబులచేతనే,సభ్యులమనస్సు మరింత రంజింప, జేయవచ్చును.

ఉ. వీరరస ప్రధానమయి ♦ విశ్రుతికెక్కిన నాటకంబులన్
పేరువహించినిద్దిరి విన ♦ వే యిప్పుడీవు సుమేరుసింగు దు
ర్వారపరాక్రముండగుచు ♦ భామిని చెప్పినమాటపైన భూ
దారుకుమార పేష్వను వ ♦ ధావధియించుట జాలియేసుమీ !

అయినను, నిందననేకచిత్రమగు చర్యలు కనపట్టును. కావున, యిందుకు సందియంబందకుము.

పారి—ఇదివరకెవ్వరును రచింపని కథను రచించిసకలజనుల విను తికిని(బాత్రు)డైన యక్కవివరుని నామంబునువినుటకునాచిత్తంబు దత్త రపడుచున్నది.

సూత్రి—కవినామధేయము వినుటకు సంతసంబయ్యెనా !

సీ. అంకినీడ్పృపుండే ని ♦ రంకుశునికవిత
మెచ్చిముదంబున ♦ నిచ్చెధనము
తిరువూరుభూపుడే ♦ ధీరువాక్ధారకు
గాంకుతోనిచ్చె బం ♦ గారుబిరుదు

సత్యవోల్ వంశాబ్ధి ♦ చంద్రులే సుకవీంద్రు
సలిపినారు తమ యా ♦ స్థానకవిగ
తిరుపతివేంకటే ♦ శ కవులెవ్వానికి
విద్యావినోదియన్ ♦ బిరుదునిచ్చి

తే. గీ. రతఁడు దోర్నిణమరాజ వం ♦ శాబ్ధిచంద్రు
డగుచు వెలయు సీతరాము ♦ డనఘగుణుఁడు
సకల సుకవివిధేయుఁడు ♦ సజ్జనుండు
కీర్తిసాంద్రుండు తలపనీ ♦ కృతికికర్త.

పారి—సరి. సరి. ఈతఁడా! నేనెవ్వరోయని తలంచితి. బాలుండగు సీతఁడు వ్రాసిన నాటకము ప్రదర్శించి సభ్యులను మెప్పించఁగలమా!

సూత్ర—అందుకు సందియంబందకుము. గ్రంథకర్త సభ్యులతో నిట్లు విన్నవింపఁగోరె.

మ. పదలాలిత్యము సున్నయంచు సరియా ♦ పాకంబు లేదంచు కో
విదబృందంబు పఠింపరాదనుచు ను ♦ ర్వింద్దీనియందెన్నొ దు
ష్పదముల్గొల్లగ నున్నవంచు నహిశా ♦ ప్రజ్ఞాన మంచెంచకే
మదికారుణ్యత దీనిఁజూడగలరున్ ♦ బ్రార్థింతునుమ్మాటికిన్.

ఇక మనముపోయి పాత్రిలను సిద్ధము చేయుదమురమ్ము.

(అని నిష్క్రమింతురు)

(ఇది ప్రస్తావన)



శ్రీ

# పీష్వా నారాయణరావు.

## ప్రథమాంకము.

[సఖారాము బాపు—ప్రవేశము.]

సఖా—(తనలో) ఆహా ! కాలమహిమ. పీష్వామాధవరావు ప్రాణంబులు విడుచు సమయంబున నన్నును, తక్కిన యమాత్యులను బిలచి కన్నీరు బెట్టుకొని "అమాత్యవర్యులారా! మీయందరి జ్ఞానసంపన్నతచేతను నేనింతవరకు నిరంకుశంబుగ ధరాచక్రంబు బాలించితి. ఇంక మీఁదు నారాయణరావుయే పీష్వాయగును. మీరందరును నాయెడల నెట్టిభక్తితో మెలంగిరో యట్లే యాతనిపట్లను జూపి యాతనికిఁదోడునీడయైరాజ్యంబును వృద్ధిపఱచవలయును"అని చెప్పెను. కాని నారాయణరావుమాత్రము మామాటవినక నానాఫర్నవీసుయందే నమ్మకముకలిగి మమ్మందర నిరాదరించుచుండె. ఒక్క త్రుటికాలంబైనను నానాఫర్నవీసును బాసియుండడు. ఆతండును నీతనిని దన వలలలో బడవేసికొనినాఁడు. నానాఫర్నవీసు నారాయణరావులఁ జూచిన త్రియంబక్జీమామాకు దప్పమరియెవ్వరికిని నిష్టములేదు. మంత్రులలోకెల్లఁ బెద్దవాడనని పేరే గాని నామాటయె తలపెట్టఁడు.

ఉ. మాధవరావు కాలమున ♦ మాన్యతకెక్కినమంత్రివయ్యు భూ
మీధవులెల్లనన్నుఁ గని ♦ మేటివటంచు నుతించునట్లుగా

సీధరఁబేరుగాంచి యిపు • డీ నృపుపాలనమందు నింత మ
ర్యాదయు లేకపోయెనని • యాత్మదలంచుచు జింతనొందెదన్.

ఈ నానాఫడ్నవీసు నారాయణరావున కేమి మందుబెట్టెనో కాని మావచనంబులే వినఁడయ్యెను. పీష్వాయనిపించుకొనుటకును, బల్వురి చే వినుతిగాంచుటకును మాధవరావున కే జెల్లెను. తక్కినవారందరును పీష్వాలేనా? పేరుగొప్పవూరుదిబ్బయను పెద్దలవాక్యంబులువ్యర్థయగునా.

మ. ధరణీభారము నిర్వహించు నత • డాత్మక్షోణిలో నందరన్
గరుణాయత్తమనంబుతో నరయుచున్ • గాపాడుటల్ మాని ని
ష్కారుణన్ రాజ్యమదాంధవృత్తి సఖులన్ • గారింనఁగాజెల్లె ద
క్కారణిన్ జేసిన ధర్మహానియు దిర • స్కారంబుగాకుండునే.

ఎక్కడిమాటలు. నేను వృద్ధుడనగుటచే నిట్లనుకొనుచుంటి. కలియుగంబున నింకెన్ని చిత్రింబుల్లు బయలుదేరగలవో. ఈకాలంబున నసత్యము, నపరిమాణము గలిగినవారినే కీర్తికన్య వరించును. ఇంకను నాకీనారాయణరావుయొద్ద మంత్రిపదవి యేటికి.

తే. గీ. గౌరవము కీర్తి మర్యాద • ఖ్యాతిమెప్పు
భవ్యగుణములేనట్టి భూ • పాలునొద్ద
మంత్రియై యుండుకంటెను • మంచిదగుచు
బిచ్చమెత్తుక పురిని జీ • వించుచుంట.

దీనికంతకును గారణము నారాయణరావు జననియగు గోపికబాయియే. ఆమె నన్ను మంత్రిపదంబునుండి తొలంగించుమని నారాయణరావున కుపదేశించినట్లు కర్ణాకర్ణిగా వింటిని.

తే. గీ. కల్లబొల్లి వాక్యంబుల ♦ కిట్టుతలప
కంచుకాగడజూచిన ♦ గరుణలేదు
సరిగ జూడంగ మనము ♦ పాషాణతుల్య
మతివలను నమ్మగూడదీ ♦ యువనియందు.

ఆడువారి మాటల నమ్మియా రాజ్యపాలనం బాచరించుట. రఘునాధరావును చెఱసాలయందు బెట్టించినందులకు, నారాయణరావునందును గోపికాబాయియందును నానందీబాయి మిగుల కోపము వహించియున్నది. కానిమ్మేమగునో చూచుచు నేనును దగినజాగ్రత్తలో నుందును (ప్రక్కం దిరిగిచూచి; అరుగో నారాయణరావు నానాఫర్నవీసు లేదియొ చెప్పుకొనుచు నిక్కడికి వచ్చుచున్నారు. నేనీచాటున డాగి వీరిసంభాషణ నాలించెద. (చాటున కేగుచున్నాఁడు.)

[నారాయణరావు నానాఫర్నవీసులు ప్రవేశించుచున్నారు.]

నారా—నానా ! పినతండ్రియగు రఘునాధరావు నాగపూరు సంస్థానాధిపతియగు మాధోజీభోస్లే ప్రోత్సాహకారణంబున నమ్మతశావను బాలకుని దత్తతచేసికొనుటకు నంత యవసరమైన కార్య మేమి వచ్చెను ?

సఖా—(తనలో) ఈప్రశ్నకు నానాఫర్నవీసేమి యుత్తరంబిచ్చునో విందును.

నానా—దేవా! అంతయు నెఱింగియుండియు నాచేత చెప్పించ పలెననియెదు గుచుండిరి. అయినను నడిగితిరి కానవిన్నవించెద. ఈదత్తత

ను తాము సెలవిచ్చినట్లు నాగపూరు సంస్థానాధీశ్వరుండగు మాధోజీ భోస్లేయే కారకుడు.

నారా—ఇందాతని కవసరమేమివచ్చెను.

నానా—

మ. మనరాజ్యంబును భాగ్యసంపదలు సంపా ♦ దించు భావంబుతో
దనవంశంబునవాని బెంచికొనబో ♦ త్సాహంబునుం జేయ మీ
పినతండ్రిగతి వానిజేకొనియు ను ♦ ర్వీనాథునింజేయగా
ఘనయత్నంబులుసల్పుచుండెనట స ♦ త్కారుణ్యముల్ లేకయే.

సఖా—(స్వగతము) ఓయీ! దుర్మార్గుడా! ఇటువంటి మిథ్యాపల్కులుచెప్పుట యెవ్వడు నేర్చికొంటివి?

నారా—(తనలో) ఔను! ఇట్లే నేనునుమామాతయగుగోపికాబాయివలన వినియుంటిని. (ప్రకాశముగా) ఏమి! పినతండ్రికే యిట్టి కోరికబుట్టెగా. అతనికి నేనేమి యపకారంబాచరించితి. మాయన్నగారైనమాధవరావుగారు కూడ నాతని కేమియు లోపముచేయలేదే. అన్నగారి మరణకాలంబున నీతనికి సంవత్సరంబున కైదులక్షలరూప్యంబులాదాయమువచ్చు జాగీరునొసంగియు, ద్రవ్యము కావలసివచ్చినప్పుడు నాబొక్కసమునుండి తీసికొనునట్లును, మరణశాసనము వ్రాసెగదా. ఇంతకంటె నతనికి గావలసినదేమియున్నది. ఇంతియెకాక నాతరపున నతడధికారము చెలాయించుటకు నాయక్ అను బిరుదు నొసంగియుంటిమి. అమృతరావును దత్తతజేసికొనినందులకాతని నెవ్వరును నాటంకపెట్టలేదే. అట్టిచో నారాజ్యపదవి నాతడపహరింపం బ్రయత్నింపంబాడియా?

నానా—అవివేకులకు యుక్తాయుక్త విచారణ మెట్లలవడును. మరియు,

తే. గీ. మేలెఱింగియు నుండరే ♦ మేదినీశ
యీప్రపంచంబునందున ♦ నెంచిచూడ
కొందరిని పురుషులే[illegible]ను ♦ కొనుటగాని
భామలాడించు కీలుబొ ♦ మ్మలు తలంప.

నారా—నిశ్చయమే. ఇందుకు రఘునాథరావే తార్కాణము.

సఖా—(తనలో) గురువిందగింజ తన నలుపు నెఱుంగదుకదా. రఘునాథరావు నీతడె త్రిప్పాడిచినాడు. ఈతని మాతయగు గోపికాబాయి వలన నీతడు వంచితుండగుట యెఱుంగడుకదా.

నానా—రఘునాథరావు భార్యయగు ఆనందీబాయియే యింత మట్టునకు దెచ్చినది. ఆతడామె యెట్లుచెప్పిన నట్లువర్తించును.

నారా—నానా! ఎంతమంది యెట్లున్నను, నేమికుట్రలు చేయు చుండినను నన్నేమిచేయగలరు?

నానా—అందులకు సందియము లేదుకాని, సఖారామబాపుగూడ నానందీబాయితోఁ గలసి రహస్యంబుగ గుట్రలు బన్నుచుండెననివింటిని. నీవుమాత్రమతి జాగరూకుఁడవై చరింపవలెను.

సఖా—(కోపముతో) వీనిపని పట్టించుటకు దగిన సమయంబు దొరికినది కాదుకదా.

నారా—సచివా!

శా. ఆపద్బాంధవుడిందిరా రమణుఁడే ♦ యశ్రాంతముఁ నాకునుం
బ్రాపై కోర్కెఫలింపజేయుచును స ♦ ద్భావంబుతో నుండ, సం

తాపంబిప్పుడు నొందనేల వినుమీ ♦ ధర్మాత్ముఁడౌ దేవుఁడే
పాపంబుల్ దిలకించుకాదె గనఁగా ♦ భావించి వీక్షింపుమా.

తే. గీ. ఆఁడువారల పల్కుల ♦ నాత్మనెంచి
కుటిలబన్నిన గానిమ్ము ♦ కోర్కెతోడ
నెట్టిపాపమెఱుఁగని ♦ నన్నేమిచేయ
గలరు పరమాత్ముఁడెప్పుడు నన్ ♦ గనుచునుండ-

నానా—నీవు బాల్యవయస్కుఁడవు. ప్రపంచానుభవంబుదక్కువ. సఖారాముబాపు మనయందు మిక్కిలి వైరము బూనియుండియు మధుపూరితవిషఘటంబువలె సంచరింపుచుండెనని నీకు దెలియకున్నది.

సీ. కూటసాక్ష్యములిచ్చి ♦ కొంపలఁబడఁద్రోయు
మహనీయులెందరో ♦ ప్రబలినారు
కల్లవాక్యములాడి ♦ కాంతలవలలోన
బడవైచు కాంతలు ♦ వరలినారు
మంత్రియైయుండియు ♦ మహీపాలు వంచింప
దలచెడి మంత్రులు ♦ వెలసినారు
మనవాడటంచును ♦ మదినెంచకయబంధు
ధనముగొనెడివారు ♦ తనరినారు

తే. గీ. చిత్ర చిత్ర గతులచేత ♦ బెలగుచుండ
నేమిచెప్పుదు మరియింక ♦ నెన్నికలవొ

మొదటఁజూచిన మోసమే ♦ యెంచిచూడ

కట్టా! యిట్లుండె నిక్కలి ♦ కాలమందు.

సఖా—(తనలో) నీహితోపదేశంబుల మూలముననే నారాయణరావింతవరకు వచ్చినది. ఓరీ! దుర్మార్గుఁడా! సన్మార్గవర్తనునివలెనీతులు గఱపుచుంటివికదా. ఛీ! నీముఖంబు వీక్షించిన పంచమహాపాతకంబులు సంభవించునుకదా. రఘునాథరావును చెఱసాలయందు బెట్టుమనిచెప్పిన తుచ్ఛుండవగు నీకిట్టి సద్వాక్యంబులెట్లలవడెనురా!ఆతనిని కారాగారనివాసుని జేయవలదని నేనెన్నిసారులు చెప్పినను నారాయణరావాలించెనా. ఇదియంతయు నీహితోపదేశముకాదా. కానిమ్ము. ఇందుకుదగిన ఫలంబునీవును, నారాయణరావును ననుభవింతురు. (ఇంచుక యూరకుండి) ఛీ! ఇంక వీరిసంభాషణ నాలించినకొలదిని యరకాలిమంటనెత్తి కెక్కుచున్నది. ఆనందీబాయి నేటిదినంబు నేటికిరమ్మని వార్తబంపినది కావున నేనిప్పుడక్కడికి కేగెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

నారా—నానా! నాకు భగవత్పూజవేళయైనది. ఇంకనేనేగెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

నానా—(తనలో) సఖారామునకు, నేను నారాయణరావునకంతరంగసచివుండనై యుంటినని మిగుల కోపముగనున్నది. సభాభవనంబున నాతఁడు నాతోసంభాషించు తీరుబట్టియు, కొందరితో నన్నుగూర్చి పలుకులపలుకువలనను నాకుఁదెలిసినది. ఈతఁడు నన్నేమియుజేయజాలఁడుగాని యానందీబాయితో గుట్రచేసి,నారాయణరావునకేమి హాని వాటి

ల్లజేయునోయని మాత్రము సందియంబగుచున్నది. కాని నేనుమాత్రి మతిజాగరూకుండనై కుమార పీష్వాయగు నారాయణరావును శక్తివం చనలేక గాపాడుచుండవలెను.

(నిష్క్రమించుచున్నాడు.)

ఇది ప్రథమాంకము.





శ్రీ

# పీష్వా నారాయణరావు.

## ద్వితీయాంకము.

[ప్రవేశము—ఆనందీబాయి.]

ఆనం.—ఛీ! స్వతంత్రతలేని బ్రతుకేల. మేము బ్రతికియున్నంతవరకు సంవత్సరంబున కైదులక్షల మాన్యంబుల స్వీకరింపుచు నాతని యాజ్ఞప్రకారము వర్తింపుచు, బ్రవర్తింపవలసినదేనా? ఆహా! ఎంత హేయభాజనంబగు బ్రతుకు. లోకంబున స్త్రీలుగాని పురుషులుగాని నెప్పుడును దమ యావచ్ఛక్తిని వినియోగపఱచి స్వతంత్రజీవనంబునకై యత్నింపవలయును గాని యిట్లుండవచ్చునా? లక్షలు వచ్చిననేమి కోట్లువచ్చిననేమి? ఇట్టి కార్యంబులందు నాకెంతయో పట్టుదలయున్నది కాని నాభర్తకు మాత్రములేదు. అతని మనంబప్పుడప్పుడుతిప్పుచుంటిని కాని యాదుర్మార్గుండగు కుమారపీష్వానారాయణరావు యించుకైనను ముందువెనుకలారయక నానాథుని నకారణంబుగ గారాగారబద్ధుని జేసెనుకదా. ఓరీ! దుష్కర్మా! జ్ఞానవిహీనా! పరవచనప్రబోధితుండవై యిట్టి యకార్యంబాచరించితివిగా? పోనిమ్మని యూరకుండిన నాహృదయంబును నీయొక్క దుష్కార్యము నగ్నిచేఁ బ్రజ్వరిల్లచేసితివిరా? నిను శిక్షించుటకుఁ బినతండ్రియే దొంకెనా? ఓరీ! క్రూరకర్మా! ఎంత

పాపకృత్యంబాచరించితివిరా! నానాధుండు, నీజోలికేమయిన వచ్చెనా? నీవు చేయు కార్యంబులకాటంకపెట్టెనా! అట్టి వానికిట్టి శిక్ష విధించితివా! ఇట్టి దుష్కృతంబొనర్చిన నీయంతంబు జూచుట నాకు నిమేషమాత్రముసుమా. (ఆలోచించి) ఆహా! ఈదుర్మార్గుఁడు మేకవన్నె పులియయ్యెనుకదా. వీనియంతంబు జూచుటెట్లు? ఏమి! మార్గంబాలోచించితిని కదా? ఏమి యాలోచించితి. (సఖారాము బాపుతో నీసంగతిని గూర్చి యాలోచింపగా నారాయణరావుని వధింపఁబ్రయత్నించుట కాతని సమ్మతిలేదనియు, నతనిని పట్టి బంధించుటకుఁ బ్రయత్నముచేయవలసినదనియు, నదియైనను వ్రాతపూర్వకమగు రఘునాధరావు యుత్తరువుండవలయుననిచెప్పెను కదా? అందుకు దగిన ప్రయత్నంబుజేసితి. నానాధుండుగూడ నారాయణరావుని వధజేయుటకు సమ్మతింపలేదు. కానిబంధించునట్లు మాత్రము యాజ్ఞాపత్రిక వ్రాసి నాచేతికొసంగినాడు. నారాయణరావుని బంధించినంతమాత్రమున నాపగదీరుటయెట్లు? చేసినపెద్దకార్యమునే చేయవలెను కాని స్వల్పకార్యము చేసినందువలనప్రయోజనములేదు. నారాయణరావుని వధించి తద్రాజ్యము సంగ్రహించిన గాని గోపికాబాయియందు నాకుగల పగఁదీరదు. (ఇంచుక యూరకుండి) నానాధుడేమి వ్రాసెనో చూచెదను. (రఘునాధరావుచే వ్రాయబడిన యాజ్ఞాపత్రమును జదివి) ఆహా ! నాప్రయత్నంబున కెంతయు ననుకూలంబుగ నున్నది. ఇందు " ధురావే " అనఁగా నారాయణరావును పట్టుకొనవలసినదని వ్రాసియున్నది. ఇప్పుడు నేను దీనిని " మరావే ' యనఁగా చంపుమనుమాట క్రింద దిద్ది యందులకు నెవ్వరికైనరహస్యము బయలుపెట్టనట్టియు నమ్మకము గలిగినట్టియు సేవకుల నియోగించ

వలెను. (ఆలోచించి) ఎవరిని నియోగింతును! ఇందు కాలోచింపనేల! చండశాసనుండగు సుమేర్సింగిందుకు దగినవాడు. బలపరాక్రమవంతుఁడు వేయిమంది వీరులెదుర్రై నిల్చినను యొక్కింతయు భీతిల్లక దాదలంచిన కార్యముచేసి తీరెడువాడు. కావున నిప్పుడాతనిని బిలిపించి యతనిని నారాయణరావును వధించు కార్యమునందు నియోగించెదను. (ఆసేవకుని వీక్షించి) ఓరీ సేవకా! నీవు పోయి తక్షణంబేగి షుబేదారగు సుమేర్సింగునకు మదాజ్ఞగా దెలిపి తోడ్కొని రమ్ము.

సేవ—(నిష్క్రమించుచున్నాఁడు.)

ఆనం—(తనలో) నాయాజ్ఞను సుమేర్సింగు సమ్మతింపడా! సమ్మతింపనిచో నేనేమి చేయుదును. (ఆలోచించి) ఏలసమ్మతింపడు. నారాయణరావునకు గీడుజేయుట కయి మూడునాలుగు మాసములనుండియే మంత్రిలలో కొందరుకూడ కుట్రలుబన్ను చుండిరి కదా. కావున వతనికిది యంతయు సవిస్తరంబుగఁ దెలిపి యతని చిత్తంబుసమ్మతిపజేచెదను. (ప్రక్కకుందిరిగి చూచి) అదుగో సుమేర్సింగు వచ్చుచున్నాఁడు.

సుమేర్సింగు—(ప్రవేశించి) తల్లీ! నమస్కారములు.

ఆనం—ప్రభుభక్తి పరాయణుండవగు నీకు జయంబగుగాక.

సుమే—అమ్మా! ఈసేవకుని బిలిపించిన కారణమేమియో కృపఁబూని సెలవిచ్చెదరా ?

ఆనం—సుమేర్సింగూ! నీవు మిగుల ప్రభుభక్తిఁబూని చరింపుచుంటివని విని నేనెంతయు నానందంబందితి. నిన్నుఁబోలు విశ్వాసపా

తు క్రీడీధరాతలంబున లేదు. నీవలన కావలసిన కార్యంబుండి యే రావించితిని.

సుమే—అమ్మా! ఆకార్యంబేదియో చెప్పుము. శక్తివంచన లేక యాచరించెదను.

ఆనం—కుమార పీష్వానారాయణరావు యధికారంబున నున్న నీవు, యతనికి సేవకుండవై, కారాగార బద్ధుండవై యున్న, యతని పినతండ్రి భార్యనగు నేను చెప్పిన పని గావించెదవో లేదో యని మాత్రము సందియంబగుచున్నది.

సుమే—(తనలో) నారాయణరావుయందు గల యసూయభావము వెల్లడించినది. (ప్రకాశముగా)

శా. అమ్మా సజ్జనులెల్లనన్ బొగడగా • నత్యంత సద్భక్తితో
మిమ్ముంగొల్చుచునుంటిగాదె మహిలో • మీయాజ్ఞ నెవ్వేళనుః
నెమ్మిః మాళినిదాల్చి సేయుదు సదా • నేనట్టిచో నిప్పుడీ
విమ్మాడ్కిః వచియింపన్యాయమగునే • యింతైనఃజింతింపకః.

మీ రెట్టి యాజ్ఞ నిచ్చినను నాపరికారమాచరించుటకే సేవకుడు సిద్ధముగ నున్నాడని నమ్ముము. అందుకు సందియమందకుము.

ఆనం—నీవు మాయాజ్ఞానువర్తివై మెలంగెదవని తెలియును. అయినను నీభావమారయ దలంచి యిట్లంటిని.

మ. ఉడుకుంభాండములోననొక్కకణమే • యూహించితత్పాకమున్
బడ లేమిన్న లెఱుంగుచందమున నీ • భక్తిగనుంగొంటి ని

ష్టము నీచెప్పిన పల్కునందున నిక్క • పూర్ణముగా సిద్ధయా
పుడమిన్ నాదగు కోర్కె పెంపుదనరన్ • బూర్ణప్రతాపోదయా.

మ విని, నాయాజ్ఞను దీర్పవే మెయనుచున్ • బృథ్వీస్థలంబందు, నే
* ననుమానించుచు నుండనాయదిక్షిథి • ర్యంబెంత యోయిచ్చినా
వినుతింబొందగ జాలినావు భళిరా • వీరాధివీరోత్తమా
కొనసాగున్ గద నేనుబూనుపనియున్ • కోర్కెల్ ఫలించున్ గదా.

సుమే—(తనలో) ఈమె యేదియో దుష్కరంబగు కార్యము బూనినట్లీమె ముఖభావము సూచించుచున్నది. ఎట్టికార్యముతలపెట్టి యుండెనో. అందు నన్నేమి చేయుమనునో. కానిమ్ము. ఏమిచెప్పునో చూతము. (ప్రకాశముగా) అమ్మా! నీపూనికనువిన నాచిత్తంబు తత్తర పడుచున్నది.

ఆనం—నేను చెప్పు కార్యమును తప్పక యాచరింతువుకదా.

సుమే—

ఉ. సందియమందనేల విను • సాహసమూనుచునైరి వీరులన్
జిందరవందరే నటుల • జేయగజెప్పిన జేయువాడ, నా
నందముతోడ నెట్టిపని • నైనను దప్పక జేతునమ్మ నీ
డెందమునందు నిట్టులు క • డిందియు సంశయమంద నేటికిన్.

ఆనం—అట్లయినచో సావధానచిత్తుండవై యాలింపుము.

సుమే—సంసిద్ధుడనై యుంటిని.

ఆనం—నామను పీష్వానారాయణరావు. జనని యగు గోపికా

బాయికిని బద్ధవైరంబని నీకుఁ దెలియునుకదా.

సుమే—(తనలో) నే ననుకొన్నట్లే యైనది. (ప్రకాశముగా) కర్ణాకర్ణికగా వింటిని.

ఆనం—ఏమీ! కర్ణాకర్ణికగావింటివా? పీష్వాజనని నని గర్వించి, మాపై నధికారముండెనని గర్వపడుచు నన్ననేక విధంబులు వంచన సేయదలంచుట నీవెఱుంగవా?

సుమే—(ఊరకొనును.)

ఆనం—ఏమి! ప్రత్యుత్తరంబీయవు. మాపీష్వాజననియనియా.

సుమే—అమ్మా! లేదు. లేదు. చెప్పెదను.

ఆనం—గోపికాబాయి వచనప్రబోధితుండై, నారాయణరావు నానాథుని కరాగార బద్ధునిజేసిన సంగతి నీవెఱింగినదే కదా.

సుమే—(తనలో) ఈమె వారికేదైన గీడుసేయ దలంచియుండలేదు కదా. ఏమి చెప్పునో వినెదను. (ప్రకాశముగా) ఎఱుంగుదును.

ఆనం—అట్లు స్త్రీమాటలనెల్ల విని సజ్జనులకు హానిదెచ్చుచున్న నారాయణరావు పాలన మీరంగీకరించి యూరకుంటిరా?

సుమే—(తనలో) సరే! ఈపలుకులవలన నీమె పూనిక సంపూర్ణముగ దెలిసినది. (ప్రకాశముగా) తల్లీ! వంశానుక్రమంబున నాతఁడు పీష్వాపదవి నధిష్టించెను. రాజెట్టివాడైనను నాతని సేవకులాతనియందు భక్తివిశ్వాసంబులు గలిగి వర్తింపవలెను కదా.

ఆనం—దుర్మార్గుఁడయిన రాజుండెనేని యాతనినివధించినన్మార్గ

వర్తనుని రాజుగాఁ జేయవచ్చునని చెప్పనార్యో క్తినీ వెఱుంగవా?

సుమే—ఇప్పుడట్టిదేమి కలిగె.

ఆనం—నారాయణరావు యట్టివాడు కాఁడా? ఆతనిపాలనా పద్ధతి బాగులేదని యెందరు మంత్రులసహ్యపడుచుండిరి.

సుమే—జననీ! ఎంతమాట సెలవిచ్చితివి!

మ. సతతంబున్ హరిపాదపద్మయుగళిన్ • సద్భక్తి సేవింపుచున్
క్షితినింధర్మపథంబు నేలుచును సం • శీలుండునై యొప్పి యా
శ్రితరత్నామణియంచు బేర్వడసి ను • శ్రీమీఱ జెన్నొందు, నా
యతులప్రాభవుఁడౌ కుమారకుని శ • క్యంబౌనె వర్ణింపగన్.

కుమార పీష్వాయగు నారాయణరావు సుగుణంబుల వర్ణింప నాతరంబు గాదు. బాల్యవయస్కుఁడయ్యును రాజ్యపరిపాలనాపద్ధతియందు జాగరూకుఁడై ప్రవర్తింపుచుండెను. నవ్వులకైనను నొకరితో నసత్యమాడడు. తనకపకారము సేయనెంచిన వానినైనను శిక్షింపదలంపడు. దీనజనంబులను రక్షింప కంకణము ధరించియున్నవాఁడు. పరధనపరకాంతాసక్తుఁడుగాక నిరంతరమును భగవద్భక్తితో గాలంబుగడుపుచుండు. అట్టి మహనీయ చరిత్రుని, సుగుణ గరిష్ఠుని నీవట్లనుట చెల్లదు. ఒకవేళ, నానాఫర్నవీసుయందెక్కువ యనురాగంబును బూని,తక్కిన మంత్రులలో గొందరియందు కోపభావము జూపించుచుండుటచేత వారెవ్వరైననాతని పాలన మంచిది కాదని చెప్పకొను పలుకులు నీవు కర్ణాకర్ణిగా వినియుందువు. ఒకవేళ నట్లుండిన పసితనంబుచే బాగోగులు తెలియక జేయుచుం

డెను గాని యుద్దేశపూర్వకము కాదని నేనునొక్కి వక్కాణింతు. కావున నీచిత్తంబునందిదివరకు కుమార పీష్వాను గూర్చి జనించిన దురభిప్రాయము సదభిప్రాయంబునకు మార్పుకొందువు గాక యని ప్రార్థించుచున్నాను.×

ఆనం—(కోపమున) ఏమీ! నారాయణరావు సద్గుణుండనియా పలుకుచుంటివి. తల్లి పుట్టిల్లు మేనమామదగ్గిరనా దాచుటన్నట్లు నారాయణరావుసంగతి నాకంటె నీకెక్కువ దెలియునా ? వహ్వా! ఇట్లు చెప్పుటకు నీమనంబెట్లు సమ్మతించినది. కనబడినవారితో నెల్ల దన్నుబొగడుమని చెప్పి నీకేమైన నిచ్చెనా? లేక నీకెబుద్ధిపుట్టెనా ? ఆదురాత్ముని, పినతండ్రికిఁబరాభవంబాచరించి క్రూరుని దుర్గుణంబులు దెలియని వారెవరు. టక్కుటమారవిద్యల నేర్చిన యీగోపికాబాయి యీతనికి దుర్బోధనసేయుటెవ్వరెఱుంగరు. ఆమె చెప్పినట్లీతడు సేయు దుష్కృత్యంబులెవ్వరికి దెలియవు. సంతానంబులేని వారమగు మేము చిన్నికుఱ్ఱని నొకనిని దెచ్చి పెంచి కొనినందులకు, దమ రాజ్యంబు హరించు దలంపునట్లాచరించితిమని గోపికాబాయివలన బోధితుండై, పినతండ్రియగునని మైననఁదలంపక దయదాక్షిణ్యములు వీడి నానాధుని చెఱలయందుబెట్టిన యదుర్మాత్ముని దురాగతంబులఁ జూచి సహింపఁజాలక పౌరజానపదుల్లోచరో

చితిమని గోపికాబాయివలన బోధితుండై, పినతండ్రియగునని మైన
నఁదలంపక దయదాక్షిణ్యములు వీడి నానాధుని చెఱలయందుబెట్టిన య

బాయి యవివేకుండగు నానాథుని మాఢ్కిగాదని తెలియదుకాఁబోలు.ఓ! సుమేరుసింగూ! ఆకుమార పీష్వాగుణంబుల వర్ణింపలేక నలసియుంటివి కాఁబోలు. అటకొంతసేపు విశ్రమించి, తద్గుణవర్ణనాయాసంబున జేసి శరీరంబునఁ బొడమిన జలధారల దుడిచికొమ్ము.

సుమే—(తనలో) ఈమె నారాయణరావునకుఁ గీడు సేయదలంచియున్నదని నిశ్చయము తేలినది. ఆహా! ఏమి చేయునో కదా. ఇప్పుడు నాకేమి యాజ్ఞ నిచ్చునో ఏమి చేయుదుఁ (ప్రకాశముగా) మాతా! ఆనందీబాయి! ఇంచుక శాంతము వహించి నాపలుకులనాలింపుము. నారాయణరావు గుణవర్ణన జేసినంతమాత్రమున నీవాగ్రహాయత్త చిత్తవగుట పాడికాదు. ఆతనియందు నేను పక్షపాతము బూనిగాని, నీయందాగ్రహము వహించి కాని, యతని గుణముల బొగడలేదు. ఉన్నదున్నట్లు వచించితిని.

ఆనం—ఇంకను నీవాసంగతి విడిచిపెట్టలేదు కదా.

సుమే—విడిచిపెట్టక నేను చేసినదేమున్నది.

ఆనం—(పరాక్రమై) కవీరా! నానాథు నారీతి పరాభవించిన యానారాయణరావు వధ నాకనులార జూచినంగాని చిత్తంబుశాంతింపదు. నాయందు భక్తిగలవాడవేని యానారాయణరావుని వధించి నా చిత్తసంతాపంబాపుము. ఇయ్యది నాయభీష్టము. ఇందుకే నిన్ను రావించితిని.

సుమే—(స్వగతము) ఆహా! ఈమె కోర్కె తెలిసినది. కట్టా! ఇప్పుడేమి చేయుదు. ఇందుకు సమ్మతింప వలసినదేనా! అయినను నిట్లు

చెప్పి యీమె మనంబును నారాయణరావు వధోద్యోగంబునుండి మర లింప జూచెదను. (ప్రకాశముగా) అమ్మా! నాచెప్పు పలుకుల కాగ్ర హింపకుము. పరమపావనతేజో విరాజమానంబగు భారతవర్షంబున మ హారాష్ట్రవంశంబున జన్మించి, బలపరాక్రమైకధనుండును, సాధువర్త నుండును, మహమ్మదీయ వంశాటవీదహనుండును నగు శివాజీమహారా జుచేనాటబడి, కాలక్రమంబున నభివృద్ధిం బొంది, పీష్వామాధవరావు కా లమున, ఫలపుష్పసంశోభితంబై, నారాయణరావుచేఁ బాలింపఁ బడు చున్న యీమహారాష్ట్ర రాజ్యకల్పద్రుమంబునను నుమ్మాల సహేతు వగుచుంటివేల. ధర్మవిధంబున రాజ్యంబు బాలింపుచు,శుక్లపక్షచ్చంద్రుని కరణిదినదిన ప్రవర్ధమానుండగుచు, దిగంతరాక్రాంతయశఃపరి పూరితుండై యగడవలెనని తలంపుచు, మహారాష్ట్రరాజ్యవిజృంభణం బునకై యెంతయో యత్నంబులు సలుపుచున్నయీనారాయణరావు ను వధింపఁజేసి పిదపనీవు పొందెడి ఫలంబేమి? ఇట్లాచరింపజేసితివని లోక నిందపాలగుట దప్ప మఱియొండులేదు. పసితనంబున నారాయణరావేది యైన మీయెడదోషంబాచరించి యుండిన, జనని సమానవగు నీవేయా తనిని మందలింపవచ్చును. అంతమాత్రమున కాతండంగీకరింపడా? తల్లీ! అట్టిపా పభూయిష్టమగు కార్యమాచరించు తలంపు మానుము.

ఆనం—(కోపమున) ఓరీ! తుచ్ఛుఁడా! మాయందు భక్తిగల వాడవని తలంచి యికార్యంబును జేయుమని చెప్పినంతమాత్రమునకు నాకేనీ వుబుద్ధులు గఱపుచుంటివా! నీమాత్రము జ్ఞానము నాకు లేదని తలంచి తివా? ఏమియో చేతువని తలంచియుండగా దుర్మదంబు బూని నాకిట్టి నీతులు గఱపి పరాభవింపఁదలంచితివా? ఇదియేనానీప్రభు విశ్వాసము.

ఇదియేనా! నీరాజభక్తి నారాయణరావునందెంత గౌరవమున్నదో యా తని పినతండ్రియందంతకంటె నెక్కువ విశ్వాసము నీవు చూపవలదా. నాకార్యము దప్పక కొనసాగించెదవను తలంపున నారహస్యముకూడబ యలుపెట్టితి కదరా! ఓరీ! జ్ఞానశూన్యా! ప్రథమమున నాయాజ్ఞాపా లింపదాల్తునని పలికి యిప్పుడు నారాయణరాయ వధోద్యోగముబూను మని చెప్ప నందుకు సమ్మతిలేని చిత్తంబున నాతో బలుకుచుంటివా ? ఛీ! పౌరుషము మాలిన బ్రతుకు బ్రతుకుటకంటె చచ్చుటమేలు. ధీరుం డవనియు, పరాక్రమశాలివనియు దలంచితిని గాని యిట్టి పిఱికిపందవని కలనైనందలంపలేదు. ఒక్కనిజంపుటకు భీతిల్లు నీవురణరంగంబున వైరి వీరులతో నేమి పోరాడగలవు. ఛీ! అసత్యభాషణా ! మదీయాజ్ఞోల్లం ఘనా! సుక్షత్రియవంశంబున జన్మమందితివి కాని క్షత్రియకళలందెల్లు శౌర్యంబు నీమొగంబున నెచ్చటను గాన్పించదు.

సుమే—(కోపమున) ఆఁ! ఏమంటివి. పౌరుషహీనుండనని నుడు వుచుంటివా? సంగ్రామరంగంబున నవార్యపరాక్రమంబున విజృంభించి యనేక వైరి వీరులను సమయించి పీష్వాలచే మన్ననలందిన నేను శూ రుఁడను కాదందువా? సుక్షత్రియకళలు నామొగంబున గానిపించుటలే దేమి? రణరంగంబున నాతో బోరెడిరిపు ప్రకరంబునకు, నాశూరత, ధీ రత, బలపరాక్రమసంపన్నతయు గానిపించును గాని స్త్రీనైయింటంగూ ర్చుండు నీకేమి తెలియును? అనేక రిపులను దునుమాడిన నాకొక్కమా నిసినివధించుటకు భయంబగుచుండెనని తలంచితివా? అఖిల కల్యాణ శో భితంబైన మహారాష్ట్ర సామ్రాజ్యంబునకు నాశన హేతువగుచుంటివ నితలంచినీచిత్తంబట్టి యధర్మోద్యోగంబునుండి మరలింప దలంచియిట్లుం

టినిగాని నారాయణరావును వధించుటకు భీతిల్లి యట్లు పలుకలేదు.

ఆనం—(తనలో) వీనికింకను గోపమతిశయిల్లజేసిన గానియాకా ర్యముచేయ సాహసింపఁడు. (ప్రకాశముగా) ఛీ! యింకను పౌరుషము కలవాడనని పలుకుచుంటివా? నాయాజ్ఞ దలందాల్పక శూరుండననియా త్మస్తవము జేసికొనుచుంటివా? నీకంటెమహమ్మదుయూసుఫును, తుల్యా జీపవారును మిగుల పరాక్రమవంతులని నాయభిప్రాయము. వారు నా మాట మాఱిందాల్చి యాకార్యము జేయుటయందు సాహసించి నిన్ను గూడ యిందు నియమింపుమని నన్ను వేడగా నందులకై నిన్నీకార్యము వారి సహాయమున సేయుమని యడిగితి. ఇంతమాత్రము స్వల్పకార్య మునకు బ్రాణంబులు పోవునేమో యని భయపడి పౌరుషము మాలిన పలుకులేల పలికెదవు? ఇది నాయాజ్ఞయేకాదు. ఇదిగో జూడుము. మా పీష్వాయిచ్చిన యాజ్ఞపత్రము. (సుమేర్సింగు ముందుత్తరము బారవై చుచున్నది.)

సుమే—(ఉత్తరమును జూచి) ఆహా! ఇది రఘునాధరావుచేతనే వ్రాయబడినది. (ప్రకాశముగా) ఏమంటివి. నేనీకార్యము సేయలేనని పలుకుచుంటివా? క్షత్రియ వంశప్రదుర్భవుండనైన నేను ప్రాణంబు లనైన యాసింపను. సమయము వచ్చెనేని రిపులరక్తంబు ద్రావి మాం సంబు భుజించి, వ్రేగులు నములగల శక్తి సామర్థ్యంబులు గలవాడనని యెఱుంగుము. నీవన్న పలుకులకు నాయొడలంతయుదహించికొని పోవు చున్నది. ఇదే నీయాజ్ఞ శిరమునదాల్చి ప్రచండకాల భైరవుండనై తు ల్యాజీపవారు మొదలగు వారిని వెంట దోడ్కొని నారాయణరావును

వధించి నాపౌరుషంబు గనుపఱచెద. ఇదే నాకాజ్ఞనిమ్ము. తక్కినవారింగలుసుకొన నేగవలెను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

ఆనం—(స్వగతము) ఈతనికి పౌరుషము పుట్టించి కార్యమునందుబ్రవేశింపజేసితిని. ఈతడు నిశ్చయముగా సమర్థుఁడనుటకు సందియము లేదు. నేనును కనిపెట్టియుండి, తగినట్లు తక్కినవారకిని నీతనికిపౌరుషము పుట్టించుచుందును.

(నిష్క్రమించుచున్నది.)

ఇది ద్వితీయాంకము.





శ్రీ

# పీష్వా నారాయణరావు.

## తృతీయాంకము.

---

—(గంగాబాయిసౌధము.)—

గంగా—(నిద్రలో) ఓరీ! మహాపాతకవర్తులారా! దుర్మార్గులారా! నిద్రించుచున్న నానాథుని ముట్టడించుటకింతమందియేలయేతెంచిరి.

తే. గీ. దుర్మదము:బూని యీరీతి ♦ దోర్బలమున
బాలనాథుని బంధింపంగా ♦ వచ్చినారె
యిట్లుసేయంగ మీచేతు ♦ లెట్టులాడు
నతడు మీకేమి యపకార ♦ మాచరించె.

తే. గీ. నీరజాక్షుఁగొలిచివచ్చి ♦ నిద్రనున్న
కాంతు నీరీతినిప్పుడు ♦ గాసిజేయ
నేమి కారణంబోమిమ్ము ♦ నెవ్వరిట్లు
బంపినారోదెలుపుడు దు ♦ ర్మార్గులార.

ఓరీ! తుచ్ఛులారా! బందిపోటుదొంగలవలె నానాథుని సౌధంబుజొచ్చి యతని నిద్రకు భంగముజేసి యిట్లాతని గాసిజేయదలంచిరా? దుర్మతులారా! నాపలుకులాలింపక నాతని దగుమకొని పోవుచుంటిరా. ఆగుడు. ఆగుడు. (అని పరుగెత్తుచున్నది.)

(అంత తొందరగా నారాయణరావు ప్రవేశించి)

మ. తరుణీరత్నమ యిట్లునీవు బరుగె • త్తం గారణంబేమి యె
వ్వరు నీకెగ్గునుసల్పిరో మనములో • భావించినారిప్పుడీ
కరణిం భీతిలనేల వారల దృఢిక్కీ • గాసిల్లగాజేసి నీ
పరితాపంబును నాప్పువాడ వచియిం • పంగాదగుక్కాసుందరీ.

(అని చేయిపట్టుకొని యాపుచున్నాఁడు.)

గంగా—(కన్నులు తెఱచి) ఏమిదీ. నిద్రించుచున్న నేనిప్పు డి చ్చటికెట్లువచ్చితిని. ఎవరో నాథుని దరుముకొని పోవుచుండిరని కలం గాంచి యాభ్రాంతిపై నింతదూరము శయ్యాతలంబువీడివచ్చితిగాబోలు. (భర్తనువిలోకించి) మనోహరా! నమస్కారములు.

నారా—తరుణీమణీ! శయ్యాతలంబువీడి యెచ్చటికిట్లు పరుగెత్తు చుంటివి. భయభ్రాంతాత్మవై యున్నట్లు నీముఖభావము సూచించు చున్నది. ఏమికారణము.

గంగా—నాథా! ఏమిచెప్పుదును. ఇప్పుడేశయ్యనుండి కన్నుమూ సినంతలోనే నదియో యొక దుస్స్వప్నముంగాంచి యాభ్రాంతిచే నిట్లువ చ్చితి. నాశరీరము కంపమెత్తుచున్నది. నాకు మిగుల భయంబగుచున్నది. నాచిత్తంబంతయు వికలత్వముచెందుచున్నది. నాకేమియుఁదోచుటలేదు. ప్రతిదినమును నామనంబుననున్న సంతోషమిప్పుడు బొడగట్టుటలేదు. కారణముమాత్రము దెలియదు.

నారా—ఆ దుస్స్వప్నకారణంబే కాని మరియొండులేదు. అదే

మందిరము. అందొక్కంత విశ్రమింతము.

(అని మందిరమున బ్రవేశించుచున్నారు.)

నారా—రమణీ! నీవుగన్న పాముకలయొక్క విధానం బెట్టిది. సహజధైర్యచిత్తవగు నీవే కలలకు భయపడుచుంటివా.

గంగా—మనోరమణా! ఇది యన్నికలలవంటిదికాదు. ఈకల గాంచిన నప్పటినుండియు నాదేహంబున బ్రాణంబులేలేవు.

నారా—అట్లయినచో నాకలతెఱంగు వినవలసియే యున్నది.

గంగా—ఏమనివక్కాణింతు. మీరు నిద్రించుచుండఁగా నెవ్వరో భటులు బందిపోటుదొంగలవలె మీశయనగృహంబు బ్రవేశించిమీ నిద్రాభంగముగావించి మిమ్ము బాధింపదలంచి యుండఁగానప్పుడు మీరు పాఱిపోవుచుండ మిమ్ము వారు వెంటాడించినట్లు కలంగంటి.

నారా—ఇదియా సంతాపకారణము. ఎంతటిధైర్యచిత్తవు. ఎవ్వరైనవినిన నవ్వుదురు. కలయందు నఱుకులాడి నట్లుగన్నట్టును. తెల్లవారి చూచినప్పుడు గాయంబులు శరీరంబుపైఁ గానిపించునా. అట్లనే కలలోగాంచిన సంగతులెవ్వరును సత్యము కానేరవు. మరియు కలయన్నది రాత్రివేళనువచ్చును. పగటివేళలంగన్న స్వప్నంబునకై యింత భయపడెదవేల?

గంగా—ఏమియోగాని మిమ్ముంగూర్చి నపరిమిత భయంబగుచున్నది.

నారా—ఎందుకీయారాటము.

తే. గీ. అఖిలజీవుల కాధారుఁ • డైనదేవు
డుండి మనయండ గృపసేకు • చుండ; మదిని
భయమునొందంగనేటికి • వారిజాక్షి
యెట్టికీడు వచ్చును నాకు • నెంచిచూడ.

మరియు,

మ. విలసద్ధర్మముఁబేర్చి యన్యమత వి • ద్వేషీభకంఠీరవుల్
కలనన్ భీతిలిపాఱునట్లుగఁ దగన్ • గావింపుచున్ భూమి, ని
శ్చలలీలన్ మహారాష్ట్రరాజ్యరమకున్ • సంస్థాపకుండంచు మిం
చె; లలిన్ వీరచయంబు మెచ్చగ శివా • జియన్న సామాన్యుడే.

అట్టివానిచే స్థాపింపఁబడిన యీమహారాష్ట్రరాజ్యలక్ష్మికి, వంశ క్రమంబున నేను భర్తనై, యష్టమంత్రిపరివృతుండనై ధరాచక్రంబునం తయు నేకచ్ఛత్రంబుగఁ బాలింపుచుండ నాకేమిభయము. ఇదియునుం గాక.

శా. వైరుల్లేరు మదీయరాజ్యపదవిన్ • వాంఛించి యేతేర నీ
వీరుండెగ్గును సల్పఁగా దలపడే • పృథ్వీస్థలంబందు భూ
దారుల్ సంతసమంద బాలనమున • ధర్మస్థితిన్ జేయుదున్
హా! రామామణి భీతినొందెదవదే • లా చిత్తమందిప్పుడున్.

ఒకవేళ రాజన్నతర్వాత వైరులెచ్చటనైనను నుండకపోరు. ఉండిన నుందురుగాక.

మ. ఇదియుంగాక రణప్రవీణుడను నే ♦ నింతైనభూమండలిన్
గదనంబుల్ గణియింతునే సమరకాం ♦ క్షన్ రాగభావించు రా
ట్ప్రదరంబున్ సురరాజ్యమేలుటకునై ♦ బంపించితద్రాజ్యము
న్మదవృత్తింగయికొందునీవు గనగన్ ♦ బర్వేందుబింబాననా.

గంగా—నాథా! వైరులన్న నెవ్వరో పరదేశములనుండి రావలెనా. అందరును నిక్కడనే యుండిరి. మీపినతల్లి యగు నానందీబాయి మీకేమియో కీడు మూడజేయవలెనని, యత్నించుచున్నదని నేను విని యుంటిని. ఆమెం దలంచిన నాకు దేహంబు గడగడవడకును.

నారా—బేలా? స్త్రీయగు నానందీబాయికినీవుభీతిల్లుచుంటివా! ఆమె నన్నేమిచేయగలదు? రాజ్య మామెయధికారంబుననుండెనా లేక యామె భర్తయధికారంబుననుండెనా? పినతండ్రికదాయని తలంచి సంవత్సరంబున కయిదులక్షలువచ్చు జాగీరునొసంగియుంటి.

గంగా—మీపినతండ్రిని గారాగృహబద్ధునిగాఁజేసిరని యామె మీయెడ మిగుల కోపము వహించియున్నది. ఎందులకు మనకీలోకాపవాదయు, నామెకాగ్రహము గలిగించుటయు, ఆయనను కారాగారవిముక్తునిజేయరాదా. అందువలన మనకు సంభవించెడు నష్టమేమియున్నది. నాథా! మీకంటె నాకెక్కువ తెలియదు. సర్వంబును దెలిసిన మీకు నేను చెప్పవలెనా! ఎట్లయినను నన్నుమన్నించి నాకోర్కె ఫలింపజేసి యానందింపఁజేయుడు.

నారా—

మ. ననువంచించి మదీయరాజ్యరమనుఁ • గైకోదలంపూనుచుఁ
దనయుం దత్తతగాంచి భార్యయగు యా • నందీదురాలోచనఁ
ఘనమౌకుటిలు బన్నగాదలచు న • క్కారుణ్యహీనాత్మునిన్
బినతండ్రిం జెఱసాలనుంచ దగదే • నీరేజపత్రేక్షణా.

ఎంతవరకో నేనును సైరించి యూరకొంటి. ఇంక నూరకొనినఁ బ్రయోజనము లేదని తలంచి యట్టికృత్యంబాచరించితి. ఇందుకు నాకు జింతయేల. భయమేల.

గంగా—అది యట్లుండనిండు. సఖారాము బాపునుమీరువిశేషము గాగౌరవించుటలేదనియు, కార్యాలోచనసంతయు నానాఫడ్నవీసునందే బెట్టితిరనియు గూడ ప్రతీతికలదు. సఖారాము ఆనందీబాయితో నాలోచనపరుండై యుండెనని వింటిని. మంత్రులలో వారికివారికి నంతఃకలహంబు లుద్భవించెనట. ఇవియన్నియు మనపై నేమిపడునోయని యెప్పుడును భీతిజెందుచుందు. ఇదియంతయు నెట్లయినయడచివేసి మనకే హానియురాకుండునట్లు జాగ్రితజేసి.నాచిత్తసంతాపంబునుబోగొట్టుడు. నేనిట్లు చెప్పితినని నాపయి నాగ్రహింపకుడు. దుర్మార్గులేవేళ నేమిసేయుదురోయని భయపడుచుందు.

నారా—

తే. గీ. పాండురాజనందనులకు • భవ్యమూర్తి
దేవకీదేవి పుత్రుండు • దివ్యమతిని
హితుడై యాచును నిరతంబు • లేలినట్లు
నాకు సఖారాము నలరడే • నాన; తలప.

ఆతఁడన్న సామాన్యుఁడా. నిశ్చయముగా రాజకార్యాలోచన మందంతవాఁడీ ధరామండలంబున లేడని నాయభిప్రాయము. మరియు,సకలశాస్త్రార్థరహస్యవేదియగు రామశాస్త్రియు, రాజభక్తిపరాయణుండగు త్రియంబక్జీమామాయును, సమయమువచ్చిన రాజునకై ప్రాణంబులర్పింపుమన్న సిద్ధపడు హరిపంతుఫడకేయును, నీముగ్వురును రధికత్రియంబున నొప్పరా. నాకడ నున్నవారిలో నెవరో దుర్మార్గులై కుట్రబన్నుచుండిన వారిద్దరుముగ్గురుదప్ప తక్కినవారెల్లప్రభుభక్తియు,విశ్వాసంబునుగలిగి మనయాజ్ఞలను శిరంబులదాల్చి సేయువారేకాని మనలవంచింపఁదలంచువారు కారు. ఆనందీబాయిగాని సఖారామునిగాని యెంతదురాలోచన మాచరించినను మనకుఁదృణమాత్రింబైనకీడును తేజాలరు. కావున నిందుంగూర్చి నీవు చింతపడుచు బెంగగొనకుము. నాకేమియుభయంబు లేదు.

గంగా—నాధా! ఏకాలంబున కెట్టిబుద్ధులు పుట్టునో. ప్రపంచంబున నెవ్వరిని నమ్మరాదు. ప్రభుభక్తిశూన్యులును, కృతఘ్నులును,కొండెకాండ్రును నీకాలంబునమిగులఁ బ్రబలి వారిమాటలవీరిదగ్గిరయు, వీరిమాటలు వారిదగ్గిరయు జెప్పి కొంపలంటించు దుర్మార్గులనేకులుగనబడుచున్నారు. సన్మార్గవర్తనుండ్లై యున్న భర్తలకు కుట్రలు బన్నుమార్గంబుల నుపదేశించి మందుమాయలచే వారిచిత్తంబులువశపఱచుకొని కీలుబొమ్మలలాగున భర్తలనాడించుపాపకర్ములును,దుర్మతులును,జ్ఞానశూన్యలునునగు స్త్రీలెందరో యుండిరి. ఇందుకు మీపినతల్లియే యుదాహరణము. కాలము మారిపోవుచున్నది. ఇదియంతయు ధనముమూలముననేయని తెలియుఁడు. కావున నాయందుబ్రసన్నహృదయులై నేనుచెప్పిన

వాక్యంబులాలించి వీరివారిమాటల నాలింపకఁ బ్రియత్తతగలిగి యే హానియు మనకు వాటిల్లకుండునట్లు చరింపుము. ఇదియే నావినయపూర్వకము గు ప్రార్థన. నాకదియే పదివేలు.

[అంతట నొకసేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సేవ—దేవా! భోజనంబునకై అమ్మగారు గోపీబాయిగారు శ్రీవారిరాకకు వేచియున్నారు.

నారా—అన్నా మఱచితిని. రమణీ! నేడు శనివారంబగుటచే దేవాలయంబునకేగి భగవదారాధన గావించివచ్చుటచే భోజనముగూడ మఱచియుంటిని. అమ్మగారు నాకై వేచియున్నారఁట. సత్వరమ్ముగబోవుదము. రమ్ము.

(నిష్క్రమించుచున్నారు.)

రంగము—నారాయణరావు మందిరము.

---

[నారాయణరావు నిదురించుచుండును.]

సుమే—(ఖడ్గధరుండై బ్రవేశించి) ఆహా! ఎట్టిదుష్కృతకార్యంబాచరింపఁ దలంచితిని. శివాజీమహారాజుచే స్థాపింపఁబడి, వంశక్రమానుగతంబున ననేకపీష్వాలచేఁబాలింపఁబడి, మాధవరావుచేనభివృద్ధిపఱుపఁబడి, శుక్లపక్షచంద్రునిభాతి దిన దిన ప్రవర్థమానయగుచు బాల్యవయ

స్కుండగు నారాయణరావుచే బాలింపఁబడుచున్న యీమహారాష్ట్రరా జ్యోన్మూలనంబునకు హేతువగు నుంటినికదా॥ హిమవత్పా ర్శ్వవర్తిపిట్టనికోట యై తనరు, స్నానంబాచరించినయంతనే సమస్తపాపంబులబాపు గోలు గం గాదిమహానదులచేనలంకరింపఁబడి, యనేక వీరక్షత్రియరాజన్యపరిపాలి త సంస్థానములుంబై, సర్వసస్యసమృద్ధియై, సకలసంపదల కాకరంబై, ప రమపావన తేజోవిరాజమానంబై విరాజిల్లుచున్నయీభారతవంశంబున, బరాక్రమంబునకిక్కయు, శౌర్యంబునకుఁ బాలవెల్లియు, స్వమతస్వగౌర వాభిమానంబుల కాలవాలంబునునగు సుక్షత్రియవంశంబున జన్మించిన నేను స్వరాజ్యోద్ధారణంబునకు యత్నింపక, దానికేభంగము గలుగసేయ దలంచితిని. ఆనందీబాయి ప్రబోధితుండనై రోషావేశంబున నోడలుదెలి యక కుమార పీష్వాయగు నారాయణరావును వధింతునని వాగ్దత్తంబి చ్చితి. ఛీ! ఎట్టియకార్యముసేయుటకు సమ్మతించితిని. దినకరతేజోవిరాజ మానుండును, పూర్ణచంద్రబింబాననుండును, కమలపత్రేక్షణుండును, సు గుణసంపన్నుఁడును, దానరాధేయుండును, నిజరాజ్యోద్ధారణాసక్తుఁడును, బాల్యవయస్కుండునునగు కుమార పీష్వానారాయణరావును వధించుట కాతడేమి నేరముగావించెను? అబ్బబ్బా! ఆతనివధించుటకుఁ జేతులెట్లా డు. నన్నుబోషించు మహారాజును నేనేజంపనెంచితినికదా. నేటివరకును ప్రభుభక్తిపరాయణుండనై, విశ్వాసపాత్రుండనని పేరువడసిన నేనుస్వా మిద్రోహ మాచరింపుచుంటికదా. ఇది పాపభూయిష్టమగు కార్యమని తెలిసియు స్త్రీచే బ్రోత్సాహపఱుపఁబడి యిట్టిదుష్కృతంబొనర్చుచుం టి. ఏమిదీ! ఆనందీబాయి నారాయణరావునందుండు కోపంబునఁజేసి యాతనిని వధింపుమని చెప్పినంతమాత్రమున నేనే చేయువలయునా?

(ఆలోచించి) ఆమె నన్ను దూషించిననుసరే బలపరాక్రమహీనుండనని తిరస్కారభావంబుతోఁ జూచిననుజూడనిమ్ము. నన్నురక్షించు నృపాలుని వధించి స్వరాజ్యోన్మూలనమాచరించి లోకనిందకుబాల్పడఁజాల. నిక్కంబుగాఁ బాల్పడఁజాల. (ఇంచుక యాలోచించి) ఆమె నన్ను పరాక్రమహీనుండననియు, నారాయణరావును వధించుటకు భీతిల్లుచుంటిననియుఁ బలికినపలుకుల కలుకజనించి, యయ్యది యిప్పటివరకును హృదయశల్యంబై యున్నది. ఇందుకేమిసేయుదు!ఆతనిని వధించినంగాని నాపౌరుషమామెకు వెల్లడికాదే. నాపౌరుషము పరీక్షించుట స్త్రీయా. ఆమె మాటలపై నీతనిని వధింతునా!(ఆలోచించి) ఏమైననుసరే ! వాగ్దానంబిచ్చి వానికిభంగముజేయుట నావంటి వీరపురుషునకు నుత్తమలక్షణము కాదే. వధించియేతీరెదను. ఇప్పుడు వధింతునుగాక, పిదప లోకంబునకు వెల్లడికాదా. అగుఁగాక,రఘునాధరావుచే వ్రాలుగలిగిన యుత్తరము నాహస్తమందున్నదికదా. అదియే నాకాధారము. కావున నారాయణరావును వధించుటయే కర్తవ్యము. (అని తనకేలనున్న ఖడ్గంబును విలోకించి)

మ. రణరంగంబున వైరి వీర నికర ♦ ప్రాణంబులఁ దీయుచున్
వినుతింగాంచితి వెంతయో! తలపఁ బ్ర ♦ ధ్వీచక్రమందిప్పుడున్
నినుఁబోషించు నృపాలుపైకి నరుగన్ ♦ జిత్తంబునం దెంచితే
ఇది వీక్షింపఁగ ఘోరపాపమగుఁ గా ♦ దే నీకు నోఖడ్గమా.

తే. గీ. సమరరంగంబునందున ♦ శాత్రవులను
జంపుచును కుడిహస్తమా ♦ చాలకీర్తి

దెచ్చుచుంటివి యిప్పుడు ♦ దివ్యకీర్తి
పీష్వ ! జెండనెంచితె యవి ♦ వేకివగుచు.

అక్కటా ! చిత్తమా! నాకధికారియైన నారాయణరావుని వధించుటకు నన్ను సమ్మతింపజేసితివా. ఛీ ! చిత్తమేమిచేసినది. స్త్రీయన్న మాటలకురోషమువహించి యిట్టియకార్యము సేయుటకు నంగీకరించితిని. ఓ ! మూఢుఁడా ! న్యాయాన్యాయవిచారణంబులేక, నారాయణరావుని వధించి పాపంబు గట్టుకొనదలంచితివా. (ఆలోచించి) ఎంతయాలోచించినను నాపీష్వానువధించుటకు చిత్తంబంగీకరింపకున్నది. కఱకుతుఱకయైనను యిట్టి ఘోరహింస నాచరించుటకు భీతిల్లుచుండును. అట్టి నీవు నదురుబెదురులేక నిట్టి ఘోరకార్యము సేయనెంచితివి. మరియిప్పుడు సంశయింపనేల. పూనినకార్యమాచరించి ఆనందీబాయికడ జేసిన ప్రతిజ్ఞ నెఱవేర్చుకొనుము.

(తెరలో కలకలము.)

సుమే—(ప్రక్కఁదిరిగిచూచి) అరుగో! మహమ్మదు యూసఫు ను, తుల్యాపవారును పరాక్రమంబున విజృంభించి ద్వారంబులకడనున్న రక్షకభటులను వధింపుచు వీరావేశంబున నిట వచ్చుచున్నారు. ఇంక నేనును నిప్పుడు వెనుదీయఁగూడదు. వీరింగలిసి నారాయణరావు వధోద్యోగంబుఁ బూనవలెను.

[మహమ్మదుయూసఫు, తుల్యాపవారు, నారాయణరావు సౌధసింహద్వారరక్షకుండగు ఖడకసింగు ప్రవేశించుచున్నారు.]

మహ—(సుమేర్సింగును విలోకించి) ఓయీ! సుబేదారు. పరాక్రమమున విజృంభించి యడ్డపడినవారినెల్ల సంతకు నింటికతిథులుగాఁ

జేయక నిక్కడ చింతింపుచుంటివా. అనందీబాయికడ నీవు చేసిన ప్రతిన మఱచిపోయి పిఱికితనంబు వహించి యూరకుంటివా! చేతగానివాడవు నారాయణరావును వధింతునని యేల ప్రతిజ్ఞ జేసితివి?

సుమే—ఓరోరీ! పిఱికులారా! చేతగాదని తలంచి యిచ్చట నిలబడలేదు. (పరాక్రమైకహీనుండనని తలంచుచుంటివా? దర్పంబెచ్చి, రిపుప్రకరంబుపైకి నేనేగినచో, నేచేయుపని మీరెవ్వ రాచరింపఁగగలరు!

మ. ధరణిం డాగిన; నాకుచుం జడిసి పా ♦ తాళంబునన్ దూరినన్
శరధిం జొచ్చిన; మేఘమండలమునన్ ♦ సౌఖ్యంబుగా నుండినన్
శరణుం బొందిన; యెల్లవారల ననున్ ♦ సైరింపు మీయన్ననున్
సరగన్ గూల్తు గుమారపీష్వ నిపుడే ♦ శౌర్యాతిరేకంబునన్.

అట్టిదే. ఈమందిరము బుధసింగు జమాదారుచే రక్షింపఁబడుచున్నది. ఇప్పుడు యీతని నెట్లయిన నెదిరించి మదమడఁచియో లేక వధించియో గాని నారాయణరావు నిదురించుచున్న యంతస్సౌధంబుం జొరలేము.

తుల్యా—ఇంతమంది రక్షకభటులు గడతేరగా నీతఁడు మనకొక లెక్కయా. ఇంక సత్వరంబుగ రండు.

(బుధసింగును సమీపించుచున్నారు.)

బుధ—(తనలో సుమేర్సింగు మొదలగువారింగాంచి తనలో) ఆహా! వీరిప్పుడు మధ్యాహ్న సమయంబున పీష్వా నిదురించునప్పుడంత స్సౌధంబున కేలవచ్చితిరో కదా! (ఆలోచించి) ఇంకను సందియంబేల. నారాయణరావున కేదియో కీడు సేయుదలంచియే వచ్చిరి. వీరిభయంకరా

కారంబులును, రక్తచేలంబులును జూడ నట్లేతోచుచున్నది.× ఓహో రక్షకభటులందరును వీరిచే మడసిరి కాబోలు. ఇప్పుడు నాకుఁ గర్తవ్యమేమి? దీనికాలోచింపనేల! శక్తిసామర్థ్యంబున వీరినెదిరించి నాపరిపూర్ణమైన రాజభక్తిని జూపెదగాని వీరిని నడుగ్గైనను నవతలఁబెట్టనీయను. (ప్రకాశముగా) ×

మ. మనమందించుక భీతిలేకయిటు ద ♦ ర్పంబేర్చి మీరందరున్
ఘననారాయణరావు సౌధమును దో ♦ ర్గర్వంబుదీపింపఁగా
జనుదేరఁ గతమేమి! దొంగలవలెన్ ♦ ఛండాలు లెవ్వారు మి
మ్మనుబంపించిరొ దెల్పుఁడీ యికనుజై ♦ వ్యంబెట్టిగొట్టించెదన్.

సుమే——ఓరీ! దురాత్మా! ఏమనిరా ప్రేలుచుంటివి? ఇట్లేమమ్మెదిరించి ద్వార రక్షకభటులందరును మడిసిరి.

ఉ. ప్రేలితివేని నీదయిన ♦ పీచమడంచి దురాత్ముఁడైన భూ
పాలుని గోపికాసుతుని ♦ ప్రాణముఁదీసెద; నడ్డమైన ను
ర్వీలురనెల్ల నొక్కత్రుటిఁ ♦ జెండెద మించి పరాక్రమించుచున్
గాలుని ప్రోలికంపెదను ♦ గన్నులకున్ గనబడ్డవైరులన్.

[illegible] నీచాత్మా! మారుమాటాడక మమ్ము నారాయణరావు అంతస్సౌధంబునకుఁ బోనిమ్ము. ఆతని వధించుటయే మాపూనిక. ఇందుకు నీ వడ్డపడితివేని నీప్రాణంబుల బాపెదవు.

బుధ——

ఉ. దుర్మతులార! మీరలిటు ♦ దోర్బల విక్రమశౌర్యమేర్పడన్
మర్మముఁబూనివచ్చి జన ♦ మాన్యచరిత్రమహాత్మునిన్ దయా

కర్మఠు పీష్వ జంపగను • గాంక్షమొయిక్కఁ దలపోసినారు! దు
ష్కర్మముగాదె! భూధవుని • జంపినచోఁ దలపోసిచూడుఁడీ.

× వీరపురుషా! సుమేర్సింగూ! నీవు నారాయణరావు సైన్యంబునందు సుబేదారుఁడవై గ్రాలుచుండి యాతని వధింపనెంచితివా! ఇన్నిదినంబులనుండి నీయట్టి రాజభక్తిపరాయణుండు లేడని జనులు చెప్పుకొనుచుండిరి. ఆపలుకులసత్యము సేయఁదలంచితివా! రాజద్రోహకార్యమాచరించియిహపరలోకంబుల సుఖంబుల రెండింటికిని జెరుచుకొంటివి. ఒకవేళ నిట్టియకృత్యమొనర్చినందుకు నీకు విశేషముగ ధనము ప్రాప్తించినఁ బ్రాప్తించుగాక. అయినను సంపదలు చంచలంబని చిత్తంబునఁదలపోయుము. వీరుఁడైన పురుషుండు తన్ను బోషించు రాజునందు భక్తివిశ్వాసంబులు గలిగి యశంబందుచు నిజదేశంబు నుద్ధరించుటకుఁ బ్రయత్నంబు సల్పవలయుగాన యిట్టిదుష్కార్యంబాచరించుటకుఁదలంపకు. అయ్యయ్యో! ఘనతకెక్కిన మహారాష్ట్రసామ్రాజ్య నాశనంబునకుఁగడంగుచుంటివే! నిన్నుఁజూచిన నాకెంతయు విచారమగుచున్నది. హితుఁడనై నీయశంబుగోరి పలుకుచున్న నాపలుకులాలించి, దుష్కర్ముల దుర్బోధనలవినక నీదారినినీవు పొమ్ము. ఈవీరులకును రాజభక్తిఁబూనియుండవలసినదనియే యుపదేశింపుచుంటి. ×

సుమే—(తనలో) ఆహా! ఈతనివచనంబులు నన్ను డోలాయమానమానసునిగాఁ జేయుచున్నవి. ఇంతవరకును వచ్చి యిప్పుడు వెనుఁదీసితినేని వీరందరును నవ్వుదురు. అక్కటా! యశంబునుగంటురోజులు వచ్చినవి. ఛీ! ఎట్టి ఘోరహింసన సేయుచుంటిని!

ఉ. రమ్మ్ము నుమేరుసింగనుచు • రాజితలీలను నమ్మఁబల్కి మో
దమ్మున శత్రుబృందమును • ధారుణిఁ జుందునఁ గెల్చునట్టి మా
ర్గమ్మును జెప్పమీరాయనుచు • గౌరవమేర్పడఁ గోరువానిఁ జి
త్తమ్మున సంశయింపక సు • ధర్మని రాజునిఁ జంపుచుంటిగా.

ఇఁక నేమైననసరే. ఇప్పుడు వెనుదీయుటకన్న నీచము వేరొకటి లేదు.

మహా—(సుమేరుసింగును విలోకించి) దుర్మతుండైన యీబుధసింగు చెప్పిన పలుకులచే, నీమనంబు కలఁగి విచారింపుచుంటివా యేమి? చాలు చాలు. నీశౌర్యము తెలిసినది. ఇట్టి వాఁడవు నీవిక్కడికి రానేల? తుదకు నీవు కార్యము భంగము చేసి మా ప్రాణంబుల దీసెడి వాఁడవుగాఁ దోచుచున్నది. చేతనైన చో చేయుము. లేదేని యింటిమార్గము పట్టిపొమ్ము.

సుమే—(కోపమున) ఔరౌరా! ఎంతటి మాటపల్కితివి! నీవలె నేను పిఱికిపందననుకుంటివా యేమి? అట్లెన్నటికిని దలంపకుము. ఈసుమేరుసింగు తాఁజేసిన ప్రతిన విడుచువాఁడు కాఁడని తెలిసికొనుము. ఏకార్యము జేయుటకైనను సన్నద్ధుఁడనై యున్నాఁడ.

మహా—(బుధసింగు నుజూచి) ఓరీ! దుర్మతీ! నీవు మాకు బుద్ధులు గఱపుచుంటివా! నీమాత్రము నీతి మేమెఱింగియుండక పోలేదు. వేయేటికి. ఈఖడకసింగును నీవలెనే యెదిరించి తుదకుఁ జాలలేక మావలనఁ గొంత లంచము గైకొని మా పక్షమవలంబించినాఁడు. నీవును నట్లే నీప్రాణములపై నాశయున్న వాఁడవైతివేని యట్లాచరింపుము.

బుధ—(ఖడకసింగును విలోకించి) ఓరోరీ! దుర్మార్గా! ఎంతనీచకార్యమాచరించితివిరా! క్షత్రియవంశప్రాదుర్భవుండవగు నీవు యిట్టికార్య

ము నేయుదువని నేనెన్నఁడును తలంపలేను. నేటివరకును నీవు నారాయణరావు యుప్పుపులుసు దినుచుఁ గాలంబుగడుపుచుండి; యిప్పుడాతనిని వధించుటకీ స్వామిద్రోహులకు సాయపడుచుంటివా! ఛీ! రాజభక్తివిహీనా! నీముఖంబు వీక్షించినఁ బంచమహాపాతకంబులు జనించును. X సుక్షత్రియుండవైన నీవు వీరిచే నెదిరింపఁబడినప్పుడునిలచి కయ్యంబాచరించి నీశక్తిసామర్థ్యంబులఁజూపి రాజుప్రాణంబులఁ గాపాడుటకు బ్రయత్నింపక నెట్టితుచ్ఛకార్యంబాచరించితివి! మిమ్ములనందరను దేశద్రోహులనఁ జెల్లును. (మహమ్మదుయూసఫు మొదలగువారినిఁజూచి) ఓరోరీ! స్వామిద్రోహులారా! దురాత్ములారా! ఎవరోదుర్మార్గులు మిమ్ము ప్రోత్సాహపఱచినంతనే ధనముపైనుండునాశచే యిట్టికార్యముసేయుటకు సమ్మతించి యిట్లువచ్చిరి. ఇట్టి ఘోరకృత్యమువలదని నేనుచెప్పుపలుకులు మీరు పెడచెవింబెట్టి, యంతటనూరకుండక నన్నుఁగూడ మీపక్షమున జేర్చుకొనఁదలంచుచున్నారు. ఈఖడకసింగునుఁబోలె నేను మీపక్షముబూనువాడనుగాను. దేహంబునఁబ్రాణంబులున్నంతవరకును కుమారవీరస్వామియగు నారాయణరావును గాపాడుటకై ప్రయత్నించి నానిజమైన రాజభక్తిని జూపించెద. దేహంబునఁ బ్రాణంబులకై యాసింపను. నాశరీరంబున జీవంబులున్నంతవరకును మిమ్ము గడపదాటి యవతలకడుగైనను బెట్టనీయను. మఱియు, X

మ. వినుఁడీదేహము బుద్బుదంబు; ధనముల్ • వీక్షింపఁగాఁ జంచలం
బణుమాత్రంబును వెంటరాదెఱుఁగరే • యద్దానికై ఘోరపుం
బని గావించుట చూడఁగామిగుల పా • పంబౌను; ధాత్రీస్థలిన్

ఘనరాజ్య క్తిని వెల్లడించెదమిముల్ ♦ గారింతు గాకున్నచో
రణమందుల్ నిహతుండనై గనుదు పీ♦ రస్వర్గముల్ హోయిగల్.

ఇంతియె కాని మిమ్ముమాత్రిమవతలకు బోనీయను.

మహా—ఏమిరా? నీకండకావరము. కానిమ్ము. నీవు ప్రాణము బాయుకాలను సమీపించుచున్నది. (తక్కినవారింజూచి) సుమేర్సింగూ! తుల్యావవారూ! చూచెదరేల! ఈతుచ్ఛుని గట్టిగా మాటాడకుండునట్లు గొంతుక నొక్కివేయుఁడు.

బుధ—(కోపముతో)

మ. ఇదెవీక్షింపుము ఖడ్గరాజమురరే ♦ యిద్దానిచే మీతలల్
పదియార్వ్రక్కలుజేయువాఁడను భయ♦ భ్రాంతాత్ములై యున్న ని
మ్మదిగాఁజేరుచు మీగృహంబులకు మీ♦ప్రాణంబులల్ బాపఁగా
మదిలోబుద్ధి జనింపకున్నదిగదా ♦ పాపాత్ములారా కనల్.

ఓరీ నీచులారా! మీరు రాజద్రోహము సేయనెంచినవారై నను మీకు మంచిమార్గ ముపదేశింపుచుంటి.

సుమే—ఛీ! నీపగల్భవాక్యంబులకిక్కడ నెవ్వరును జడియువారులేరు. శూరులు లేనిచోట నిట్టి వాక్యంబు లుచ్చరింపుము. నీకు జడిసి మే మేగుదుమో లేక మాకు జడిసి నీవే యేగుదువో త్రుటిలోఁ గనుగొందువు గాక.

బుధ—అన్యాయంబుగ ఘోరహింసాసక్తులై యున్న మీకునా ఖడ్గంబుచే బుద్ధి చెప్పవలెనుగాని మాటలతోఁ బ్రయోజనము లేదు.

(అని కత్తిఁ ద్రిప్పుచున్నాఁడు.)

మహ—చూచెదవేమి? (అని సుమేర్సింగు మొదలగువారు బుధసింగుపై నెక్కి పెట్టునఁబడి వధింపుచున్నారు.)

(అంతట ఇచ్ఛారాముపంతు తొందరగాఁ బ్రవేశించి రాజద్రోహులం జూచి)

ఇచ్ఛా—ఏమిటీ కలకలము. మీచేలంబులన్నియు రక్తమయంబై యున్నవేమి? ఇట్లు భీభత్సాకారంబుల ధరించితిరేల.

(అప్పుడమ్మువ్వురును నాతనిపైఁబడఁ బోవుచుండఁగా నతఁడు పరుగిడును. మహమ్మదుఃయూసఫుతఖుము కొనిపోయి వెంటనే ప్రవేశించును)

మహ—ఓయీ! సుమేర్సింగూ! ఇంకను జూచెదవేల! రక్షకభటులందరును మడిసిరి. మనలనెదిరించినిలచిన ఇచ్ఛారాముఁకూడ నాచే ప్రాణంబుల బాసినాడు.

సుమే—ఆతని నెట్లు వధించితివి?

మహ—ఆతడు పరుగిడిపోయి గోశాలలో నొక గోవుచాటున డాగియుండె. అంతట నేను మిగుల కోపావేశపరవశుండనై యాగోవును నాతనిని గూడ వధిరిచితిని.

సుమే—ఆహా! ఏమిపని గావించితివి! (తనలో) అక్కటా! నారాయణరావును వధించుచున్నందులకుఁగూడ విచారింపనుగాని, అతిపావనంబగు భారతవర్షంబున, సకలహిందువులచేతను పరమపవిత్రమైనదిగ నెన్నఁబడుచుఁ బూజింపఁబడుచున్న గోవును వధించెనని వినినందులకు మాత్రము జింతింపుచుంటి. ఇప్పుడేమిచేయుదును? ఈతనిని నేనుదూషించినను ప్రయోజనములేదు. ఆజన్మహిందూమతద్వేషులగుమ్లేచ్ఛ

లిట్టి కార్యములనే సేయుచుందురు. అకటా! ఈతఁడెంతపాపంబునకుఁ బాలయ్యెను!

మహ—ఇంక మనమాలోచించుచు నిలచున్న లాభములేదు. ఇప్పుడు మనము నారాయణరావు యంతస్సౌధంబుఁజొచ్చి పూనినకార్యముఁ నెఱవేర్చి కృతార్థులమగుదము. రండు. రండు. (అనిముప్పురును నారాయణవు శయనమందిరము ప్రివేశించుచుండఁగా నచ్చటనున్న భటుడి కలకలముజూచి భయపడి తలుపువేయబోవ, నాతనిని వీరుబట్టి చంపుదురు:—పిదప, శయ్యాగృహము ప్రివేశింపుచున్నారు.)

సుమే—నెమ్మదిగారండు.నారాయణరావునిదురించుచున్నాఁడు.

మహ—ఇదియే మంచిసమయము. ఈతనినిద్రను దీర్ఘనిద్రను జేయుము.

సుమే—ఛీ! ఎట్టిమాట జెప్పితివి. నిద్రావస్థలోనున్నవారినిఁ దునుమాడుట యెంతపాపము!

ఖడకసింగు—

తే. గీ. శత్రుశిబిరంబు నడిరేయి ♦ శౌర్యమేర్చి
జొచ్చి నిద్రలోమునిగిన ♦ శూరవరుల
ద్రోణిగూల్చిన సంగతి ♦ దలపుమయ్య
యట్లుజేయుట మనకొప్పు ♦ నధిపయిపుడు.

(అంతలో నిద్రావస్థనున్న నారాయణరావు! శత్రువుల యలికిడి వినిలేచి యెదుటనున్నవారిని విలోకించి)

నారా—(స్వగతము) ఆహా! ఇదియేమి ఆశ్చర్యము! నాసతీమణిగాంచిన కలనిజంబయ్యెనుకదా. ఇప్పుడీ సుమేర్సింగు మొదలగువారు నాకేదియో గీడుసేయుటకే తలపెట్టి యిచ్చటికివచ్చినారు. ఇప్పుడు నేనేమిసేయుదు! హా! దైవమా! నాకెట్టిసంకటము గల్పించితివి. ఒంటివాడనగునేను వీరినేమి సేయఁగలను! ఈకుట్రయంతయును రఘునాధరావుచే గల్పింపఁబడినదేయని నాకుఁదోచుచున్నది.

సుమే—మహమ్మదుయూసఫ్! ఇంక సందియంబేల. నారాయణరావు నిద్రనుండి లేచినాడు. మనకార్యము జూచుకొందము. (అనినారాయణరావును సమీపించుచున్నారు.)

నారా—(తనలో) ఇప్పుడు నాకేమియు దారిగాన్పింపకున్నది. ఈతలుపుతీసికొని కదురయంబున బరుగెత్తి యీకుట్రకుఁగారకుండైన రఘునాధరావు శరణుఁజొచ్చెద. (అని తలుపుదీసికొని పరుగెత్తుచున్నాడు.) (సుమేర్సింగు మొదలగువారాతనిని దరుముకొని పోవుదురు.)

(తెరలేచెను.)

రంగము—గణపతిమహాలు.

---

[రఘునాధరావు ప్రవేశించుచున్నాడు.]

నారాయణరావు—(పరుగెత్తుకొనివచ్చి రఘునాధరావు పాదములపై (బడి)

శా. కక్కా! నీకపకారమేమియు ధరన్ ♦ గావింపగాలేదు, నీ
పక్కంజేరితి శత్రుబృందమదిగో ♦ పాలించిరక్షింపవే
చక్కంజేయగవచ్చుచుండి రకటా ♦ శాసింపుమీవారలన్
మొక్కుల్గైకొనినన్ను నీసుతుగ్రుపన్ ♦ బ్రోవం దలంపూనుమా.

పినతండ్రీ! సుబేదారు సుమేర్సింగు మొదలగువారు నన్నువధింపఁ దలంచి యేతెంచిన భయపడి నీశరణుఁబొందవచ్చితి. ఈయకార్యముసేయుమని వారలకాజ్ఞాపించినది నీవేయైయుందువు. నాయందు గృపాంతరంగుండవై నాతప్పులను మన్నించి యీదుష్టులనువారించి నన్నురక్షింపుము. ఈమహారాష్ట్రరాజ్యంబంతయు నేకఛత్రింబుగ నీవేపాలింపుము. నాకింతకూడుగుడ్డలకు మాత్రమొసంగుము. తండ్రీ! నన్నురక్షింపుము. నీపాదంబులబట్టుకొని ప్రార్థించుచుంటి.

(అప్పుడు నారాయణరావు సేవకుఁడగు ఛపాజేతిలేకరుఅనునతఁడు ప్రవేశించుచున్నాడు.)

ఛపా—(తనలో) అరుగో నారాయణరావును వధింపశత్రులరుదెంచుచున్నారు. ఎట్లో వీరిచేజావక దప్పించుకొనివచ్చితి. అక్కటా! నారాయణరావు రఘునాథరావు పాదములపైఁబడి బ్రతిమాలుచున్నాఁడు. ఓహో! సుమేర్సింగుమొదలగువారు సమీపించుచున్నారు. ఇప్పుడునేనీ నారాయణరావునకడ్డముగానుండి, శత్రువుల కత్తిపోటులాతనిపైఁబడకుండ, నాప్రాణమున్నంతవరకును గాపాడెద. (నారాయణరావునకడ్డముగా నుండును.)

(సుమేర్సింగు మొదలగువారు ప్రవేశింతురు.)

నారా—తండ్రీ! రక్షింపుము. మహారాష్ట్రరాజ్యంబంతయు నేలుకొనుము. ఈదురాత్ముల వారింపుము.

రఘునాథరావు—(సుమేర్సింగును జూచి.) ఆగుము. ఆగుము.

(సుమేర్సింగు మొదలగువారాతని మాటవినక నారాయణరావుముందున్న ఛపాజేతిలేకరును జంపివేసి నారాయణరావును వధించుచున్నారు.)

(తెరవాలును.)

ఇది తృతీయాంకము.







# పీష్వా నారాయణరావు.

## చతుర్థాంకము.

—(విష్ణుశర్మ ప్రవేశించుచున్నాఁడు.)—

విష్ణు—(స్వగతము) ఆహా! మిట్టమధ్యాహ్నమైనది. నడుచుటకు కాళ్లు స్వాధీనములో లేకయున్నవి. ఆకలి కడుపుదహించివేయుచున్నది. ఇప్పుడేమిచేయుదు? అక్కటా! శరీరంబున ముసలితనమావహించినప్పుడు జీవించుటెంతయు కష్టతరంబుకదా.

తే. గీ. తప్పె; శారీరమునఁ బటు ♦ త్వంబు; చూపు
గానుపించదు నడువంగఁ ♦ గాళ్ళురావు
ముదిమిగప్పెను నీరీతి ♦ బ్రదుకుకంటె
స్వర్గపురమున కేగుట ♦ బాగుకాదె.

ఇప్పుడు నేనెవ్వరిగృహంబుజేరి యాకలిదీర్చికొందు! ఇట్టిసమయంబుననాకుఁ గుమారపీష్వానారాయణరావు దర్శనంబిచ్చునా? ఎక్కడనేని భుజించి యించుక విశ్రాంతిఁజెంది సాయంసమయమున పీష్వాసందర్శనంబాచరించి నాకోరికఁ దెలుపుకొందు. ఆనారాయణరావు,

తే. గీ. పేదబాపనవాడంచు ♦ బేర్మిఁబూని
యన్నవస్త్రంబులనొసంగి ♦ పన్నెమీర
పోషణముసేయు నిరతంబు ♦ బూనుకొనఁడె
యస్మదీయసంప్రార్థన ♦ మాలకించి.

కానిమ్ము. నేనిప్పుడాకనబడు గృహంబుజేరి యందున్న భూసురులను నింతభోజనముపెట్టుడని ప్రార్థించెద. (అని నడచుచు ముందుఁజూచి) ఆహా! ఏమిదీ? ఈపురంబంతయు నల్లకల్లోలమైయున్నది. ఇందుకేదియో యొక కారణముండకపోదు.

సీ॥ కనులబాష్పంబులు ♦ గాల్వలై పారఁగా
నేడ్చుచుగుంపుగా ♦ నేగువారు
గుండెపైఁజేతులు ♦ గొట్టుకొంచును గడు
విలపించుచుండెడి ♦ వీరవరులు

(తెరలో)

(ఇంత పసితనమందే నీకు మరణము సంభవించెనా! మహారాజా!)

ఇంతబాల్యమునందె ♦ యేగితే మమువీడి
హారాజయంచును ♦ నడలువారు

(ఆలోచించి) ఏమిదీ! నామదికి సందియంబొడమున్నది. ఎవరో మహారాజఁట. బాల్యంబునందే మరణమునొందెనఁట. ఎవ్వరైయుండును! బాల్యవయస్కుండగు మహారాజు పీష్వానారాయణరావేకదా. అతనికేమియు నట్టిగతి సంభవింపలేదుకదా.

[తెరలో]

మీపినతండ్రి మూలంబున నేకదా నీవు బలవన్మరణమొందితివి.

(ఆలించి) పినతండ్రికారణం ♦ బున గాదొకో నీవు
జననమ్యోము వీడి ♦ యనెడివారు

(ఆలోచించి) పినతండ్రిమూలంబున మరణంబువా్రసెనఁట. ఈప లుకులన్నియు నారాయణరావునకే చెందుచున్నవి. ఆతని పినతండ్రి రఘునాథరావుగదా. ఆతఁడే రాజ్యకాంక్షచే నిట్టిదుష్కృత్యంబాచరించి యుండును.

తే. గీ. వగచుచును మదినిమిగుల ♦ బొగులువారు
నంచితంబైన యూరాట ♦ మందువారు
గలిగి మిగుల సంక్షోభమై ♦ జెలగుచుండె
నిప్పురంబేగృహంబున ♦ నేనుజూత్తు.

కానిమ్ము. భగవంతుఁడున్నాఁడు ఈపురజనుల యొక్కసంక్షోభ ముచూడ నాకును నాకలియడగిపోయినది. (ప్రక్కలందిరిగిచూచి) అదుగో! ఎవ్వరో పురుషుండిటువచ్చుచున్నాడు. అతనిచే సంగతియంతయు సవిస్తరంబుగవిందు.

[ఒక పురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విష్ణు—(పురుషునివిలోకించి) అయ్యా! మీదీపురంబేకదా!

పురు—అవును. నీకేమికావలయును?

విష్ణు—అయ్యా! నేను పరదేశవాసిని. అన్నవస్త్రంబులులేక పీష్వానారాయణరావును దర్శించవలెనను తలంపునఁ జూడవచ్చితిని.

పురు—అయ్యో! ఇంకెక్కడినారాయణరావు! ఆతఁడు దివంబ లంకరించినాఁడు.

విష్ణు—అక్కటక్కటా! ఆమహానుభావుండు మరణించెనా! నాయనా! అడిగితినని కోపింపకుము. ఆవధావిధానమొకింత సవిస్తరంబుగ జెప్పగలవా !

పురు—చెప్పుటకేమున్నది. మిట్టమధ్యాహ్నము సౌధంబున నారాయణరావు నిదురించుచుండఁగా రాజద్రోహులు ముప్వురు సౌధంబునఁ బ్రవేశించి యీతనివి వధింపదలంపఁగా నతడు భయపడిగణపతిమహాలునందున్న రఘునాధరావుకడకు బరుగెత్తి రక్షింపుమని కాళ్ళపైఁబడెనుగాని యాతఁడు రక్షింపలేకపోయెను. ఇంతలో రాజద్రోహులలో ముఖ్యుండగు సుమేరుశింగు నారాయణరావును వధించెను.

విష్ణు—అన్నన్నా! ఆదుర్మార్గుడింక మూఁడుదినంబులకన్న నెక్కువబ్రతుకడుసుమా. ఇదినీవు నమ్ముము. తరువాత,

పురు—అప్పుడు రాజనగరంబున నెంతయో వ్యాకులంబుజనించినదిగాని మంత్రులెవ్వరును తమగృహంబులను విడిచి రాజమందిరంబునకేతెంచి యీవ్యాకుల కారణంబడిగినట్లు కానిపించదు.

విష్ణు—మంత్రులుగూడ కుట్రలోనుండిరికాబోలు. తరువాత,

పురు—తరువాత, కొంతసేపటికి మలోజీఘూర్పారి, సాహసముచేసి రాజమందిరము బ్రవేశించి రఘునాధరావునుజూచి వ్యాకులకారణం బడిగెను. అందులకాతండు జరిగినసంగతి దెలిపెను. ఈఘోరవార్తను వినినతోడనే ఘూర్పారిరఘునాధరావుని తృణీకరింపుచు నిర్భయహృదయుండై «నీవీమహాత్కార్యంబాచరించినందులకు యశఃకాముండవైతివి" యని పలికెను. అందులకు రఘునాధరావు మించినదానికి వగచినఁ

బ్రియోజనము లేదు. ఇంకనన్ను పీష్వాగాఁ బ్రకటింపుడని చెప్పెను. త
రువాత కలకలము శాంతించినది.

విష్ణు—తరువాత.

పురు—తరువాత, కలకలము శాంతించినది. ఆనాడు పీష్వామృ
తికళేబరము ''లక్డీపం తెనకడ కగ్నిసంస్కారంబునకుఁ గొనిపోఁబడెను. చ
నిపోయిన కుమారపీష్వాకు బ్రింబకుమామా యగ్నిసంస్కారముచేసెను.
అగ్నిసంస్కారసమయంబున నానాఫర్నవీసు మొదలగు పండ్రెండుగురు
మంత్రులా ప్రదేశమునకుఁ బోయిరి. అప్పుడు వారు బాలాజీబాజీరావు
సంతతిలో నాకరుపీష్వాయైనఁ గాని తాము మన్నింపఁగూడదని నిశ్చయిం
చుకొనిరి. జనులందరికిని మాత్రిము భటులకు జీతములు ముట్టకపోవుట
చే నిట్టివధ జరిగెనని తెలుపఁబడినది. ఇది జరిగినసంగతి. ఇంక ముందే
మి జరుగునో.

విష్ణు—మహారాష్ట్రిసామ్రాజ్యము కల్లోలస్థితికిఁదెచ్చి భారతీయ
స్వరాజ్యప్రితిష్ఠాపనము పెల్లగించివైచిన రాజద్రోహులింకను బ్రితికి
యుండిరా.

పురు—అట్టివారు బ్రితికియుండక మరణింతురా? భగవంతుడ
ట్టి క్రూరాత్ములకే పూర్ణాయుర్దాయ మొసంగుచుండును.

విష్ణు—ఇంతదుష్కృత్యమాచరించిన రఘునాధరావు మాత్ర
ము బాగుపడునా! నాయనా! మహారాష్ట్రిరాజ్యమంతరించు రోజులు
వచ్చినది. ఛీ! ఇంత యన్యాయము జరుపఁబడిన పురంబున నున్నచో
పాపంబు సంభవించును. కావున నేఁబోయి వచ్చెద.

(నిష్క్రిమించుచున్నాఁడు)

పురు—మంత్రియగు నానాఫర్నవీసు నన్నేటికో రమ్మని కబురు బంపెను. సత్వరంబుగ నేఁ బోవలెను. (నిష్క్రమించుచున్నాఁడు)

రంగము:—గంగాబాయి సౌధము.

---

గంగాబాయి—(విచారముతో-స్వగతము) హా! మనోహరా! అనాథనై విలపించుచున్న నన్నొంటిగావిడిచి మీదారిమీరు జూచుకొనిరా! అయ్యో నన్నుబాసియుండుటకు మీమనంబెట్లు సమ్మతించె. నేనెవ్వరింగూర్చి భయపడుచుంటినో యట్టి దురాత్మురాలగు నానందీబాయియే నాకొంపదీసినది. ఆనాడు మధ్యాహ్నము నేను కూడ తమయొద్ద నేలయుండకపోతిని. ఉండినచో నిట్టిది సంభవింపక యుండునేమోకదా. పరాక్రమశాలివైన నీబలం బారాజద్రోహులు నిన్నుముట్టడించి నప్పు డెందడంగియుండె. ఏమిపిచ్చి! నలువురులో నొక్కఁడేమి సేయగలఁడు. రఘునాధరావు పాదంబులపైఁబడి రక్షింపుమని మీరుగోరినపుడు జాలి దలంచియైనను గాపాడవలయునే. తటస్థముగ నూరకొనుట పాడియా? కిరాతహృదయునకు న్యాయాన్యాయము లెట్లు తెలియును. ఆతండును నీవధకు గారణుండేకదా. ఆద్రోహులు మిమ్ము వధించుటకు మీరేమి యపరాధము గావించిరి. అయ్యో! ఒకరిని నిందింపనేల. ఇది యంతయు నా కర్మవ్రాత!

సీ. ఆక్రమతులు ని ♦ న్నరికట్టువేళల
నాత్మయందెట్టుల ♦ యడలినావొ

8.

అలసుమేర్చింగు ద • యాహీనత గళంబు
బొడుచువేళను నెట్టు • పొగిలినావొ
ప్రాణంబు బాయుచో • పడతినో ననుగూర్చి
యెంతెంత మదిలోన • నేడ్చినావొ
ఆకస్మికపుమృతి • యంచును తల్లికై
స్వాంతంబునను నెట్లు • చింతపడితొ

తే. గీ. హా మనోనాథ! జితచంద్ర • యమలహృదయ
హా ప్రభాకరతేజ! హా • అనఘమూర్తి
హా మహారాష్ట్ర రాజేంద్ర! • హా గుణాఢ్య
మమ్ము విడనాడి పోతివే • మాన్యచరిత.

తే. గీ. సకల భూపాలచంద్రులు • సంతసింప
నిమ్మహారాష్ట్రరాజ్యంబు • నేలుదువని
ధైర్యమును బూని యుంటి జి • త్తంబునందు
నిట్టులౌనంచుఁ గలనైన • నెంచలేదు.

చ. కడుపెపు బిడ్డలం గనియు • గాలముదీరిన పిమ్మటం గదా
పుడమినివీడి స్వర్గమును • బొందుట జెందును నట్లుగాక, నీ
పడతిని నన్నువీడి బల • వన్మరణంబును జెందినావె యా
చెడుగుల కారణంబునను • చింతను గూర్చితివే మనోహరా.

(ఆలోచించి, అయ్యో! ఏమి పిచ్చి! గతించిన నా మనోహరునికై
విచారింపనేల. మనోరమణునితో నా దినంబుననే సురపురంబును జేరు భా

గ్యమబ్బలేదు. ఇంక నేను నాప్రయత్నంబు జేసికొని యగ్నింబడి సురసాన్నిధ్యముజేరిన నాజీవితేశ్వరుని పాదసన్నిధికేగి కృతార్థురాలనయ్యెద. (ఆకాశమువంకజూచి పరమేశ్వరుని ధ్యానంబునటించుచు) హే! పరమేశ్వరా! మనోవాక్కాయకర్మంబులందు మనోహరుఁడే దైవసముండని తలంచి యతని పాదసేవ నాచరింపుచు పతివ్రతనై వెలుఁగొందుచుందునేని, నాభర్తను త్వరలో గలిసికొనినట్లు దయాంతరంగుఁడవై మార్గముచేయుము. ముందుజన్మకైనను నారాయణరావే భర్తయగునట్లు ప్రసాదింపుము. (ప్రక్కంజూచి) చెలీ! నర్మదా! ఇటురమ్మా.

నర్మద—(ప్రవేశించి) అమ్మా! ఏమిశెలవు?

గంగా—నర్మదా! చెప్పటకేమున్నది.

తే. గీ. సంపదలపైన నాసచే • జాలిలేక
భవ్యరాష్ట్రంబుగైకొన • వాంఛబూని
సద్గుణుండైన నానాథుఁ • జంపినారు
దుర్మతుల్ బంధుజనములే • తోయజాక్షి.

నర్మద—తల్లీ! ఇదియంతయు నేవినియుంటి. నీనాథుని జంపించి నిన్నుదరిగానని శోకాంభోరాసిలో ముంచిన యదురాత్ములుమాత్రము సుఖంబుగ జీవింతురా! “వినాశకాలే విపరీతబుద్ధిః” యనునట్లువారికంత్యకాలము ప్రాప్తించుటంజేసియే యిట్టి దుష్కార్యంబొనర్చినారు. అమ్మా! తనువులు శాశ్వతంబులుగావు. ఎప్పుడో యేమార్గమునుండియో శరీరంబునుండి ప్రాణంబులు పోవలసియేయున్నవి. సమస్తమును దెలిసిన నీకు నేను చెప్పవలసినదానను కాను. ఈదుఃఖము నీవు బ్రతికియున్నంతవరకు

ను నుండునదియే. కావున నీవిట్లు చింతంబూని నిద్రాహారంబు మాని శరీరము శుష్కింపఁజేయుట పాడి కాదు. ఈసంగతి నీవుమాత్రమే యెఱుంగనది కాదు. కావున ధైర్యముబూని భర్తమరణంబును మఱచిపోయి యెట్లో కన్నులుమూసికొని కాలంబు వెళ్ళదీయుము.

గంగా— చేటీ! ఎట్టిమాట చెప్పితివి. భర్త మరణంబును మఱచి పోయి యెట్లో కన్నులు మూసికొని కాలంబు వెళ్ళదీయుమని యుపదేశించుచుంటివి. క్షితి తలంబునఁ బతిలేని సతి బ్రతుకేల. అట్టి బ్రతుకు బ్రతుకుకంటె జచ్చుట మేలగును కదా. నిరంతరంబును మన్మనోహర పాదసేవ జేయుచు సంతోషాంబుధి నోలలాడుచుండెడి నేనిప్పుడాతనింబాసి విధవనై భూతలంబున జీవించెదనని తలంచితివా? ఒక్కత్రుటికాలంబైనను నన్నెడబాసి యెఱుంగని నామనోహరుని విడనాడి నే జీవింపఁగలనా? పతులెక్కడనున్న సతులు నక్కడనే యుండి తీరవలెనని యార్యులు చెప్పు వాక్యంబులు నీవు వినలేదు కాఁబోలు. నర్మదా! వేయేటికి! నాజీవితేశ్వరుని పదసన్నిధికేగినగాని నాచింతబాయదు. కావున నాకడసారి ప్రార్థనమాత్ర మాలకించి, మనోరమణ పాదదర్శనోద్యోగంబున నించుక సహాయం బాచరింపుము.

నర్మ— తల్లీ! ఎంతమాట చెప్పితివి! నీవు నీభర్తంజూడఁ బోయెదవా! హరి. హరీ! పాపము శమించుగాక. అట్టికార్యము సేయవలదని చెప్పుచున్నందుకు నన్ను మన్నింపుము.

గంగా— నీయుపదేశమిపుడు జక్కగనున్నది. భర్త పోయిన వెనుక పతివ్రతలు సేయు మహాత్కార్యంబు సేయనున్న నన్నువారింపుచుంటివా! నీవు యుత్తమసంజాతవు కావుగాన నట్లువచింపుచుంటివి.

నర్మ—నీవు చేయఁబోవుకార్యమెద్ది?

గంగా—నీకుఁ దెలియనిదేమియున్నది అగ్నిం బ్రవేశిల్లజే యును. నేనందుఁజొచ్చి ప్రాణనాథుని సాన్నిధ్యము జేరెద.

నర్మ—అయ్యో! బలవన్మరణముకోరెదవా! అమ్మా! మమ్మం దరనేమిచేసిపోయెదవు. ఇదినీకు ధర్మమనితోచెనా. కుమారుడు గతించి నందులకే యున్నహారంబుల వర్జించి బెంగగొనియున్న గోపికాబాయికి నీమరణంబు మరింత చింత బుట్టించును.

గంగా—పతివ్రతలకిట్టి కార్యంబు సేయుట ధర్మమే. నీవు సం దియంబందక జితిజేర్పుము.

నర్మ—అట్టి ఘోరకార్యము సేయుటకు నన్నేనియోగించెదవా!

గంగా—ఇదిమాత్రము చేయక తప్పదు. తక్కిన వారందఱును రాజద్రోహులై యుండిరి. నీబుణము ముందుజన్మంబునకు దీర్చికొందు.

నర్మ—(కన్నీరునించుచు నిష్క్రమించుచున్నది.)

గంగా—నారాయణరావునే నాకు నాథునిగఁ బ్రసాదింపుము.

ఆనందీబాయి—(తొందరగా భటులతోఁబ్రవేశించి గంగాబా యినిజూచి) ఏమీ! ఆత్మనాథుని గలుసుకొనుటకు అగ్ని ప్రవేశమాచరిం తువా. ఏమి! పాతివ్రత్యము. చచ్చినవానికై నీవుగూడ ప్రాణంబుల బా సికొననేల. వృథాయాసపడెదవేల. ఏదియోమాకు దోచినదింత కూడును గుడ్డయు నొసంగెదము. హాయిగఁ గాలంబు గడుపుచుండుము.

గంగా—అత్తగారూ! జరిగినదేమియో జరిగినది. భర్త మరణంబునకు సంతాపపడుచున్న నాచిత్తంబును మరింత క్షోభపెట్టుట మీకుచితంబుగాదు. చేసినదేమియో చేసితిరి. ఇంక మీరు నాతెరువునకు రాక నాయిచ్ఛవచ్చిన యట్లాచరింపనిండు. నాయందు దయయుంచి మీ సౌధంబున కేగుడు.

ఆనం—(కోపమున) ఏమియో మేము చేసితిమని నుడువుచుంటివే. నీభర్త మరణంబునకు మేమే కారణమా? ఇట్టి తిరస్కార వాక్యంబులచే మమ్ము దూషింపదలంచితివా? నీవు చిన్నదానవు అంతియె కాక, నిప్పుడు మాస్వాధీనురాలైతివి. మాయిచ్ఛవచ్చిన యట్లు చేసితీరవలయును.

గంగా—అమ్మా! కోపపడకుము. మిమ్ము దూషించు దాననుగాను. నాభర్త మరణంబునకు మీరు కారకులని నే నుడువలేను. ఆయన చావునకు విధియే కారకుండు. నావాతికు మీరేమి సేయుదురు. (ఇంచుక యూరకుండి) నాతో వాగ్వాదము బాచరించుచు నాకార్య భంగంబునకు గడంగకుడు.

ఆనం—(కోపమున) ఏమి! మా మాటలాలింపవు కదా. అట్లయినచో నీకార్యంబునకు భంగము లేనట్లే యాలోచించెద. (భటులంజూచి) భటులారా! ఈమెను నాసౌధంబున నొక గదియందుంచి పైన తాళము వేయుడు.

[భటులు_గంగాబాయిని పట్టుకొని తీసికొని పోవుచున్నారు.]

గంగా—హా! మనోహరా! (అని యేడ్చుచు నిష్క్రమించుచున్నది.)

ఆనం—(నిష్క్రమించుచున్నది.) ×





శ్రీ

# పీష్వా నారాయణరావు

## పంచమాంకము.

రంగము—బయలు.

[ఖడ్గధరుఁడై సుమేరుసింగు—ప్రవేశము.]

సుమే—

మ. అకటా! ముందును వెన్కనారయక ను ♦ ద్యద్భూరికోపంబుతోఁ
ప్రకటప్రాభవపుణ్యమూర్తియగు పీ ♦ ష్వాఁజంపి ఆరాజభ
క్తికి దూరంబయినాఁడ నెంచఁగనుస ♦ త్కీర్తిప్రతాపంబులున్
వికలంబయ్యెధరాతలంబునను ♦ జీవింపంగనేలాయికన్.

ఆహా! పావనంబగు భరతవర్షంబునసుక్షత్రియ వంశంబున బుట్టి నేటివఱకున్ దిగంతరాకాంతయశః పరిపూరితుండనై మెలగుచు పీష్వాల మన్ననలందుచు ననేకరణంబులందుబలపరాక్రమమునవిజృంభించి వైరి వీరదర్పాంధకారప్రభాకరుండనై జయంబుగాంచుచు సంపూర్ణమైన రాజ భక్తినిబూని, సంచరింపుచున్న నేను మహారాష్ట్రరాజ్యనాశన హేతువగు దుసని నెఱింగియు నొక్క స్త్రీ దుర్బోధవలన నన్ను తనప్రాణంబుబోలె

పోషించుచు ఏదికావలసిన నదియొసంగుచు, కాపాడుచున్న పుణ్యమూర్తి యగు పీష్వానారాయణరావు నకారణంబుగ నాచేతులార జంపితిగదా? ఇది నాకీర్తిప్రతాపంబులకేగాక నావంశంబునకుకూడ గళంకమాపాదించినది. నిన్న మొన్నటిదాక సుమేరుసింగు కడు ప్రభుభక్తిపరాయణుండనియు, విశ్వాసపాత్రుండనియు, చెప్పకొనుచున్న జనంబులెల్లరు నేడాతనికంటె పాపభూయిష్టుడును, రాజద్రోహియు ముల్లోకంబులలేడని చెప్పకొనసాగిరి. ఇట్టి తుచ్ఛకార్యంబాచరించిన నేను ప్రపంచంబున నికతలయెత్తి మెలంగనేర్తునా! అబ్బబ్బా మెలంగజాల. నిక్కముగా మెలంగజాల. (యించుక యూరకుండి) ఓ ఆనందీబాయి,

తే. గీ. భర్త మహారాష్ట్రరాజ్యంబు ♦ బడయుసంచు
మదినిదలపోసి యీకుట్ర ♦ బన్ని పన్ని
మాకు గోపంబుదెప్పించి ♦ మాన్యచరితు
జంపగా జేసితివిగదా ♦ సాహసమున.

నీకెంతరహస్యంబుగ ఈకార్యము మాచేత జేయించినను రామశాస్త్రి మొదలగువారికి యీకార్యము దురాత్మురాలవగు నీవు చేయించినదియే యని తెలియబడియున్నది. జనులందరు నిస్సిగ్గే చెప్పకొనుచున్నారు. మగనికి రాజ్యంబుసంభవించునని యిట్టియకార్యము మాచేత జేయించిననీవు భూతలంబున నింకను జీవంబులనుదాల్చియుండుట నాకెంతయు సిగ్గగుచున్నది. అవును కుమారునిజంపించిననీకు లోకాపవాద భరించుట యదియొక కష్టకార్యముకాదు.

తే. గీ. గోపికాబాయి యందున్న ♦ కోపమిపుడు
దీర్చుకొంటివిగాదె స ♦ ద్దివ్యచరిత

గంగ విధవయయ్యెనుగదా ♦ తొమ్మాలలంబు
భర్తచేతను నేలింపు ♦ పాపచిత్త.

ఇట్టి కార్యంబాచరించిన నీవుగాని, నీభర్తగాని, సంపద్వైభవో పేతులై జీవింతురనిమాత్రము దలంపకుము. మహారాష్ట్రరాజ్యనాశన కాలముసమీపించినది. (ఆలోచించి) ఏమిది నేనెంతవెర్రివాడను. ఆనం దీబాయిని దూషింపనేల? ఆమెనారాయణరావుని వధించుమని వచియిం పగ కోపావేశపరవశుండనై అట్టి యకార్యముచేయుట కేలసమ్మతించితిని. ఆకార్యము నేను చేయనని చెప్పియుంటినేని యెవ్వరు సేయనోపుదురు. ఈవధకుఁ గారణమానందీబాయియైనను సుమేర్సింగు నారాయణరావును వధించెనని లోకంబున నపవాదపడకమానదు. హా! నారాయణరాయా

చ. చతురంభోధి పరీతముద్రిత మహీ ♦ చక్రంబు బాలింతువం
చతిసంతోషముబొందెనీజననియూ ♦ యాశల్వృథాయయ్యె నో
క్షితిపాలాగ్రణి యేమటంచుమదిలో ♦ జింతింతు,యానందియా
కుతుకంబంతయు నేటగల్పె నకటా ♦ కుచ్చెళ్ళలోఁ దాఁచుమ్మె.

నేనేకదా నీప్రాణంబులు దీసితిని.

సీ. ఇచ్చినాడవుకదా ♦ యెన్నని బిరుదులు
మంచిసేవకుడంచు ♦ భవ్యతేజ
మెచ్చినాడవుకదా ♦ మేలైన ప్రభుభక్తి
పారీణుడంచును ♦ ధీరచరిత
మునమందితివికదా ♦ కదనమున రిపుల
దునుమాడువాడంచు ♦ ననఘమూర్తి

చెప్పినాఁడవుకదా • యొప్పఁగానీవుండ
రపులెంత మనకంచు • శ్రీగుణాఢ్య

తే. గీ. అట్టి సత్కృపాశాలివై • యలరునిన్ను
గొంకుజంకును లేకింత • కోపినైన
నీదు పినతల్లియాజ్ఞచే • నిన్నుఁజంపి
నాఁడ నక్కటా నారాయ • ణా ! సుచరిత.

ఉ. కక్కనుజేరి యేడ్చుచును • గావుమటంచు పదాంబుజంబులన్
మ్రొక్కుచు గౌగలించుకొన • ఘోరకృపన్ విడనాడినిన్నునన్
జక్కను జేయుచున్నపుడు • జాలి నెట్లులు బొందినావొ; హా
యక్కట నేనకుండె యిటు • లారసిబెట్టగ నయ్యొ వంచునన్.

తే. గీ. రాజులెల్లరు నిన్ను వి • రాజలీల
నెపుడు గొలువంగ మహరాష్ట్ర • మేలుచుండి
యక్కటా నీకుసేవకు • హస్తమందె
ప్రాణముల బాసిపోతివే • భవ్యమూర్తి.

(ఇంచుక యూరకుండి) ఆహా! నారాయణరావును జావుటంజేసి నాకీర్తికి భంగమైనది. రాజభక్తికి మొదలే సున్నయయ్యెను. ఇంతవరకును ఘనకీర్తివహించిచరింపుచున్న నేనీక నిట్టికార్యమాచరించితినను లోకోపవాదమునఁ బాలై జగంబునఁ దలయెత్తి మెలంగజాల. (ఆలోచించి) మెలంగఁజాలకఁ జేయునదేమున్నది. ఏమిమార్గమున్నది. సుక్షత్రియవంశ ప్రాదుర్భవుండనై, ముందువెనుకలారయక నిట్టితుచ్ఛకార్యమాచరించినందులకు నేనిప్పుడు నారాయణరావును గలిసికొనుటయే మేలైన

మార్గము. ఇట్లాచరించితినేని లోకోపవాదయే మగును—ఏమగును, లోకోపవాద యమగుంటును. నారాయణరావును వధించుటంజేసి యే నేరమెఱుఁగని యాతఁడు నిజమైన రాజభక్తిపరాయణుండగుటచే నారాయణరావును దివంబున దర్శింపనేగెనని చెప్పకొందురు. కావున నేనింక సంశయింప. యీఖడ్గరాజంబుచే నాకంఠంబుఁ బొడిచికొని నారాయణరావును దర్శింప నేగెదను. (ఖడ్గమును విలోకించి) ఓఖడ్గరాజమా!

మ. రణమందుల్ రిపుబృందముల్ దునిమినన్ • రాజిల్లగాఁ జేసియుల్
ఘననారాయణరావు భూధవునరుల్ • గాపాడు భవ్యాత్మునిల్
దునుమంజేసితివట్టి పాపమును బో • ద్రోలంగ నేనిప్పుడా
యనఘుల్ జేరెద జేర్పుమీకరుణతో • నర్పింతుగై మోడ్పులల్.

(అని ఖడ్గంబుచేఁ గంఠంబుఁ బొడిచికొని పడిపోవుచున్నాడు.)

---

రంగము—రఘునాధరావు దర్బారు.

---

[ప్రవేశము] రఘునాధరావు, సఖారాంబాపు, హరిపంతుఫడకె ముదలగు మంత్రులును సరోజినాయకశూదు అను వృద్ధపరిచారకుడును ఘూరుపూరె మొదలగువారు,

రఘు—సచివులారా,

ఉ. శ్రీయుతుఁడైనమాధవుఁడు • దివ్యతరంబుగ రాజ్యమేలె నా
రాయణుడేగుదెంచి ఘన • రాజ్యము రాజిలనేలుచుండ న

న్యాయముబూని మాతనిని ♦ నంతకు నింటికి బంపె దైవమే
నేమెడబుత్తు నేమనుదు నెవ్వరి ♦ జీరుదు పుత్రుఁ బ్రావృకై.

తే. గీ భవ్యగుణవంతుఁడయ్యును ♦ బాలుఁడగుట
నెరిగియోం యెరుగకను నక ♦ చెఱునునై చె
నందు కెంతైన చింతింప ♦ డెందమందు
బాలుమృతికి మాత్రింబునే ♦ వగచుచుంటి.

చ. జరిగినదానికిఁ మదిని ♦ జాలవిచారము నొందనేల యీ
ధరణి పతిత్వమబ్బెనుగ ♦ దా యికనాకును మీరలెల్లరుఁ
గరుణవహించిచాటుము జ ♦ గంబున పీష్వనునేనెయంచు భూ
వరనిచయంబునఁ బొగడ ♦ బాలవజేసెద ధారుణీస్థలిఁ.

శివాజిమహారాజుచే స్థాపింపబడి మాధవరావుచే నభివృద్ధిపరుప బడి నారాయణరావుచే కొద్దికాలము పాలింపబడిన యీమహారాష్ట్ర రాజ్యభారంబు నాభుజస్కంధమున బడినది. కావున మీరలెల్లరును నన్ను పీష్వాగాప్రకటించి యధావిధిగా రాజ్యపాలనమందు నాకు తగిన సహాయము నాచరింపవలయును.

నఖా—(హరిపంతునుచూచి) మొన్న లకిడివంతెనవద్ద మనము బాలాజీబాజీరావు సంతతిలో నొకరు పీష్వాయైన గాని రాష్ట్రీయ వ్యవహారములలో జోక్యముకలుగజేసుకొనమనియు రఘునాధరావును గాని అతని సంతతినిగాని మన్నింపరాదనియు మనము నిశ్చయించుకొంటిమి గదా. యిపుడు యితని ప్రశ్నకు నేమి యుత్తరంబిత్తుము.

హరి—ఈవ్యవహారంబున నిఖిలశాస్త్రవేత్త నిర్భయహృదయుండునగు రామశాస్త్రి యేమి ఆలోచన చెప్పునో కనుగొందము. అతండించుక కాలంబులో ఇచటకు రాగలఁడు.

(నానాఫర్నవీసు ప్రవేశించుచున్నాఁడు.)

నానా—(స్వగతము)

మ. కరమందుం గరవాలముండియును నీ ♦ కన్ శత్రుబృందంబులన్
బరిమార్పన్ దగు శౌర్యముండియు ధరా ♦ భారంబు నేలింపగా
వరమార్గంబులు జెప్పుచుండియును నా ♦ భవ్యాత్ము నామిత్రునిన్
గరిమన్ గావగలేక పోయితి గదా ♦ కౌటిల్యులన్ జంపుచున్.

కట్టామిత్రమా! నారాయణరాయా! నీవధావిధానమును గూర్చి యొక్కింతయయినను ముందేయెరింగియుంటినేని ఆదుర్మార్గులను మదీయ ఖరాసి కెఱయిచ్చి నిన్ను రక్షింపకుందునా?

తే. గీ. నిన్న మొన్నటిదాకను ♦ వన్నెమీఱ
నిన్ను సేవించి యలరితి ♦ నిన్ను జంప
జేసినట్టి య్యారఘునాథు ♦ సేవనెట్లు
చేయుగల నిం మిత్రమా ♦ చెప్పుమయ్యా.

నాసంతోషము నా ప్రతాపము నా స్వాభిమానము నాపౌరుషము నీమరణముతోడనే యంతమొందినవి.

తే. గీ. అనుగుసఖుడ రాజువై ♦ యలరుచుండి
భవ్యకృపతోడ నన్నుగా ♦ పాడుచుండు

నీవు మోక్షంబు నొందంగ ♦ నేగ నేను
బ్రతికి యున్నందులకు సిగ్గు ♦ పడుచునుంటి.

(ఇంచుక యూరకుండి)

కానిమ్ము ఇప్పుడు నేను ఈదర్బారున ప్రవేశించెద
(అని సభనుజేరి ఆసీనుడగుచున్నాడు.)

సకోజ—ఓయీ పీష్వారఘునాథరాయ! నిండు సభయందు వృద్ధుండనగుటచే చెప్పసాహసించితిని. నారాయణరావు వధకు నీవేమూల కారణుండవు. పీష్వాకుటుంబమున జన్మించినందులకు నీవట్టికౄరకృత్యంబునాచరించి మిగుల యశంబు సంపాదించితివి (అనుసరికి రఘునాథరావు భటులిరువురు అతనిని చంపివేయుదురు)

ఘర్ష్వారి—ఉన్న వాస్థవంబును చెప్పినందులకు! యీవృద్ధపరిచారకుడు చంపబడువాడా! ఆహా ఏమిన్యాయము! ఇట్లయినచో నీవెన్నాళ్ళు ఈమహారాష్ట్ర రాజ్యంబు పాలించెదవు. అతడన్నది వాస్థవంబుకాదా నిశ్చయముగా నదియే మరల చెప్పుచుంటిని. నీవీమహాత్కార్యమొనర్చి యశస్కాముండవయితివి.

రఘు—అయ్యలారా జరిగిన దానికి తగిన ప్రయోజనమేమి? ఇంక మీరు పురంబున నన్ను పీష్వాగా ప్రకటన చేయింపవచ్చును.

(రామశాస్త్రి ప్రవేశము)

రామ—(స్వగతము) ఆహా! మహారాష్ట్రరాజ్యమునకు ఎట్టిదుస్థితి సంభవించినది. ఆడువారి మాటలు విని మొగవారు రాజ్యముపాలించు దినములు వచ్చినవి. ఇదియంతయు కలికాలమహాత్మ్యము.

మ. కలికాలంబిది యిందసత్యములు బ ♦ ల్కంజాలుమర్త్యాళికిఁ
గలుగుఁ సంపద హెచ్చుగాసిరియు వే ♦ డ్కఁ వచ్చునవ్వారలే
గమపూజ్యుల్ ధరణీతలంబున కనఁ ♦ కారుణ్య హీనాత్ములే
బలుకీర్తిన్ గొనుచుందురెప్పుడు ♦ దలంపఁ చిత్తమందక్కటా.

ఇది అంతయు ధనయాసచేయుచున్నది.

తే. గీ. ఎట్టిదుష్కార్యమైన చే ♦ యింపగలవు
పరమ మిత్త్రులస్నేహము ♦ బాపగలవు
ఆత్మజాతును జంపించి ♦ యులరగలవు
ధనమ! నిన్ను వర్ణింపంగ ♦ తరముగాదు.

ఇప్పుడు నేను రఘునాధరావుకడకేగి నేనడుగవలసిన ప్రశ్నంబులనడిగెదను (అనిముందుకు నడచును.)

రఘు—(లేచి) రామశాస్త్రినెదుర్కొని తోడితెచ్చి వుచితాసనాసీనుని జేయుచున్నాడు.

రామ—రఘునాదరావూ

మ. వరరాజన్యులచే బొగడ్తగను పే ♦ ష్వావంశ మందుఁ భళా
జననంబంది సుకీర్తిగైకొనక తు ♦ చ్ఛంబైనదుష్కార్యమున్
బొనరింపన్ తలపేలగల్గెనకటా ♦ పుణ్యంబటంచెంచితే
నినువీక్షించిన నాకు జుట్టుకొనవే ♦ నిక్కంబుగా పాపముల్.

రఘు—మహాత్మా పండితశిఖామణీ. తాము నాయందెన్నడును యిట్టి నిర్దయవృత్తితో పలుకలేదు. నేడేమిరయో మీసంభాషణవిపరీతముగా నున్నది.

రామ-

మ. విపరీతం బగుభాషణం బనుచు నీ ♦ విందోయికన్ దోచనే
కపటాంతఃకరణుండవై తనయునిన్ ♦ గాసిల్లగాజేయు న
య్యో పవిత్రింబగుమార్గముః మరచితే ♦ హామర్మతీ యింతలో
జపలత్వంబును నందితే ధనము నీ ♦ చాకన్నులన్ గప్పెనే. X

జడమతీ! ఏమియు నెరుంగనివానివలె నాయెదుట నటించుచుంటివా! నారాయణరావువధకు కారకుండవునీవుకావా? రాజ్యకాంక్షచే నాతని నీవు వధియింపించలేదా? నీవు నారాయణరావును జంపుటకు సుమేరుసింగు మొదలగువారలకు నధికారమీయలేదా?

రఘు—(తనలో) అకటా! ఈపుణ్యాత్మునకునిజంబంతయు తెలిసెగాబోలు. ఎట్టివారలయిన నీతని యెదుటబడిమాటాడజాలరు. కావున నిజముచెప్పియేతీరవలయును. (ప్రకాశముగా) మహానుభావా! చేసిన పాపంబు చెప్పినపోవును. సుమేరుసింగు మొదలగువారికి నారాయణరావును బంధింపుమని ఆజ్ఞయిచ్చితిగాని వధియింపుమని మాత్రమీయలేదు. ఈవధలో నాకంతమాత్రమే సంబంధమున్నది. ఇందుకు నెట్టిప్రాయశ్చిత్తముచేసుకొమ్మని శెలవిచ్చినను తప్పక చేసుకొందును.

రామ—అందులకు నీప్రాణమర్పించుటయే ప్రాయశ్చిత్తము. నీవుపాపాత్ముడవై రాజ్యంబేలవచ్చునుగాని సుఖంబుగజీవించుటయసాధ్యము నీకుగాని నీరాజ్యంబునకుగాని యభివృద్ధి గలుగదు. నీవీరాజ్యము పరి

పాలించునంతవరకును నీకొలువు అంగీకరించుకుంటయే గాక పునహాపట్ట ణంబున అడుగయినను పెట్టను.

మ. ధరణీ భాగమునందు డీనులకు నా • ధారంబునై యొప్పుచున్
వరసంపద్విభవంబునై యెసగి భూ • పాలాగ్రణీస్తోత్రమై
స్థిరగీర్తింగొని పాపకార్యముల నర్థిం • జేయగా నెంచెహా
సారిదిక్ శ్రీమహారాష్ట్రరాజ్యమునశిం • చుంగాక భూమండలిన్.

ఇదేనే పోవుచుంటిని. (నిష్క్రమించుచున్నాడు.)

(తెరవాలును)

(ఇది పంచమాంకము)



సీ. గోదావరీతీర ♦ భూదేవవాస రా
జనరేంద్రమెవ్వారి ♦ జన్మభూమి।
సద్గుణుండంచు యు ♦ శంబువడసినట్టి
వీరభద్రాఖ్యుం డె ♦ వ్వారితండ్రి।
కలితపుణ్యచరిత్రి ♦ కమనీయగుణగాత్రి
వీరాంబతలప నె ♦ వ్వారితల్లి
దీనజనములకు ♦ దివ్యకల్పకమాచు
బజగువైశ్యకుల మె ♦ వ్వారికులము।

తే. గీ. అట్టి బొండాడ నారసిం ♦ హాభిధాను।
మాధవుండేలుగావుత ♦ భవ్యకృపను।
సకలసౌభాగ్యసంపద ♦ సంతతంబు।
నొసగి చిరంజీవిగాజేసి ♦ వసుధయందు॥

మ॥ సొరదిన్ గ్రంథములెన్ని యేనియును న ♦ చ్ఛాత్రించుచున్ వేడ్కతో।
వరభాషాసతి నాదరింపుచుంగృపా ♦ భావంబుతో సత్కవీ।
శ్వరులన్ సంతసమారంబోంచుచును నై ♦ శ్వర్యంబుతోంద్రూగుచున్।
స్థిరకీర్తిన్ గొనుమయ్య భూతలములో ♦ శ్రీనారసింహాహ్వయా.

దోణంరాజు సీతారామారావు.

